నవంబరు 1974



# భారతి

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల రూపాయిన్నర

CT

లక్ష్మీ చిత్ర వారి

# సత్యానికి సంకెళ్ళు

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
కె.యస్.ప్రకాశరావు

నిర్మాతలు
పి.రామకృష్ణారావు-ఆర్.ఏకాంబరం



# భారతి

## మాసపత్రిక



శివలెంక శరభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



నవంబరు 1974

సంపుటము : 51 : ।                                        సంచిక : 11 :

విడిపత్రిక వెల రూపాయిన్నర

111

# విషయానుక్రమణిక

## నవంబరు 1974

# పురుష సూక్తం

డా. ముదిగొండ శివప్రసాద్

ఆకాశం ఘనీభవించక ముందే
అవని రూపురేఖ లద్దుకొనకముందే
'అతడి' ఆశలు ఆశావకాశాలను చీల్చుకుంటూ
రెక్కలు విప్పి రిక్కలను చుంబించుకుంటూ
ఆదర్శాల గగనానికి గిజిగాడుకులాయాలవలె వ్రేలాడినప్పుడు
ఆయన, సుందర స్వప్నాలు గడ్డకట్టి ధరిత్రిపైకి జారిన
స్నిగ్ధప్రత్యూష పవనం మానవుడు
స్వర్గం తొణికి బొట్లు బొట్లుగా జారిన
చైతన్య జీవన స్రోతస్విని మానవుడు.

*　　　*　　　*

నేల[1]నుండి నింగి[2]కి పద్మాల బాటలు పరచినవాడు
స్వర్గాన్ని నేలమీదికి దింపి,[3] జయకేతన మెత్తినవాడు
దేవతలకు ఆదర్శ జీవితం నేర్పినవాడు
ధరిత్రినే దేవాలయంగా మార్చినవాడు
ఇతడి పేరు మానవుడు
కిన్నరుడూ— వానరుడూ— కాని నరుడు
ప్రకృతి కాంతకు తగిన వరుడు
ఈ మానవు డొకనాడు పొదిగిన గుడ్లు
మహాబలిపురాలు—అజంతాలు, ఎల్లోరాలు
మానవు డొకనాడు కన్నాడు కలలు
మాయన్, లోథాల్, సింధూ, యూఫ్రిటిస్, టైగ్రిస్ తీరాలలో
మానవుడు తాను తలచిన ప్రత్యంగుళమూ
మహాప్రయాగగా వారణాశిగా మార్చాడు
మానవుడు తన్ను తానే బ్రహ్మమని అనుకోవడం
మను సంతతి మనీషా పాటవానికి గౌరీశంకర శిఖరం.

*　　　*　　　*

ఇంతకీ
ఎవరీ మనిషి??

మనిషంటే ఎల్లయ్యా పుల్లయ్యా మల్లయ్యా అని కాదు
యుగయుగాల జడం, జీవానికోసం జరిపిన సంఘర్షణ
పశుత్వం పరమేశ్వరత్వానికై సాగించిన అన్వేషణ
జన్మదుఃఖం, జరాగ్రస్త మనడం పుస్తక పండితుల మస్తక
విన్యాసం మాత్రమే.

పుట్టడమే ఒక బ్రహ్మానందమని గ్రహించడం
ప్రప్రథమ సూత్రం అనుష్ఠాన వేదాంతంలో—
పరమేశ్వరుడు ఆపలేని ఊహా జలపాతం
పశుపక్ష్యాది స్థావర జంగమ సరోవరంగా మారింది
ఈ సరస్సులో తిరిగే రాజహంసపేరు మానవుడు
ఇందులోని సహస్రదళ కమలాలకై, ఇలా
ఇందులోనే ఈదుతూ వున్నాడు,
వినీలసలిలాన్ని తన పక్షచ్ఛవితో
విశుద్ధ ధావళ్యసత్వవర్ణం కిందికి మారుస్తూ

*　　*　　*

## 2

ఎదుగుతున్న జగత్తుకు
ఎందుకో స్తంభించింది నేడు మనస్సు
సాగుతున్న మనోమయకోశం
జారిపోయింది విజ్ఞానంనుండి అన్నానికి[4]
పద్మకాండం పైకెక్కుతున్న సర్పం[5]
పక్కచూపులు చూస్తున్నది
అతిమానవుడి[6] నుదుట పురిటిలోనే
అణుబాంబు పేలింది.
మానవుడి నెత్తిన కోహినూరు పెట్టి
అరవిందాలు[7] వికసింపజేసి, జగజ్జ్యోతులనువెలిగించే లోపలే
మధ్యాహ్నమే సూర్యగ్రహణం పట్టింది
పట్టపగలే చిమ్మచీకటి కమ్ముకుంటున్నది.
నగరంలోని డ్రైనేజీ జీవితం
నాగరికత పేర పిలువబడుతున్నది
సంస్కారం లేకుండా శిశువునుండి పశువులోకి ఎదగడం
సంస్కృతి పేర చెలామణీ అవుతున్నది
క్రోధం కాలకూటం కాగా, కమిలిపోతున్నది జగత్తు
కరుణామయుడైన గరళకంఠుడు మాత్రం

## పురుష సూక్తం

కనుచూపు దూరంలోనే వున్నాడింకా, ఈ
మనోక్షీర సాగర మథనంలో—
యంత్రానికి జనకుడు ఏ మేధావి అయితే నేం కాని
విచక్షణ లేకుండా ఈ విషకన్య
ధరిత్రినంతా తన మృత్యు పరిష్వంగంలో
దగ్ధం చేయజూస్తున్నది.
శిల, బలి కోరుతున్నది, తన్ను దేవుణ్ణిగా మలిచిన శిల్పినే
శివుని సుందర మానవ తపస్సు
కందర్పుని బాణాలకు చెదిరింది
ఏ శాక్తేయుడు వస్తాడో ఇక !

*   *   *

అందమైన మానవ మందిర సువిశాల ప్రాంగణం చుట్టూ
ఎందుకిన్ని ముళ్ల పందిళ్లూ
మూసిన కిటికీలూ??
గులాబీలను ఇంటి చుట్టూ నాటుకొని
కమురుకంపును నిశ్వసిస్తున్నా డేమిటీ యజమాని?
కొబ్బరిచెట్ల ఆకుల మధ్యనుండి
కురిపిస్తుంటే చంద్రుడు పీయూషాన్ని
పుక్కిలిస్తున్నాడు యంత్ర నిర్మాత రేయిం బవళ్లు
పొగగొట్టాల నోళ్లతో
బొగ్గుపులుసు వాయువును
సన్నిపాతరోగంతో నర్తిస్తూ
శివతాండవం చేస్తున్నానని భ్రమిస్తున్నాడు
మెగాటన్ను బాంబులు పేలుస్తూ
మురుస్తున్నాడు దీపావళి వచ్చిందని—
ఇజాల తోడేళ్లు విజృంభిం
నిజాన్ని—అజాన్ని నమిలినట్లు నమిలివేస్తున్నవి
సిద్ధాంత ప్రయోగశాలల్లో
సామాన్యులు ఎలుకల్లా వాడబడుతున్నారు—
శాస్త్రీయపు ఎరువులతో నేడు మానవుల పంట పండుతున్నది
యంత్రశాలలనే వంటసాలలలో తనను తాను వండి వార్చుకుంటున్నాడు
నరుడు.

నైష్ఫల్య నాగరికతాధార కింద
నిర్జీవ కుసుమాలు ప్రభవిస్తున్నవి

ముఖాని కంటించుకున్న చిరునవ్వుల వెనుక
మహిషాసురత్వం బింబిస్తున్నది
అతిమానవుడికి పురిటిలోనే సంధి కొడుతున్నది
అణురాక్షసుడు పుడమిలో పాటవ పరీక్షలు జరిపి
జగన్మిథ్యా సిద్ధాంతాన్ని ప్రత్యక్షం చేస్తున్నాడు.

3

జగత్తులోని ద్వైవిధీభావాన్ని
చిత్రకారునిలా శబ్ద ఫలకంలో
తొమ్మిది రంగుల కుంచెతో[9] చిత్రిస్తున్నాడు కవి
ప్రేలుడు సహజ పరిణామం కాదనీ
ప్రశాంత వ్యాళాహుతిచే వచ్చే
పారిజాత పరిమళ మారుత కలరుత ప్రస్తారం కాదని చెపుతున్నాడు
గింజనుండి కొమ్మ - కొమ్మనుండి రెమ్మ
రెమ్మనుండి లత - లతనుండి లతాంతం
ఇదీ అవిచ్ఛిన్నధారాప్రవాహ సహజ జీవన పరిణామం
ఆగక సంకల్పగతితో సాగే
హవిర్ధూమాల, ఆషాఢ మేఘమాల.
అందుకే నిందాగీతం కాదు
విరాశాగీతం కానే కాదు
సూర్యగ్రహణం వీడిన తర్వాత
చంద్రోదయం వస్తుందనే ఆశ
చంద్రోదయం తర్వాత మళ్లీ
సూర్యుడు కాషాయారుణ కుంకుమంలాగా
పుడమి తల్లి నుదుట భాసిస్తాడనే
ఆకాంక్ష !!

---

వివరణ: (1) మూలాధారం (2) సహస్రారం (3) శక్తిపాతం (4) అనమయ కోశం (5) కుండలని–యోగభ్రష్టత (6) Superman (7) అరవిందులు (8) ఖసవేశ్వరుడు (9) నవరసాలు.

---

# శ్రీ కూర్మనాథాలయం

రచన, ఫోటోలు: శ్రీ ఎమ్. ఎస్. ఆర్. కె. ప్రసాద్

శ్రీ కూర్మం పూర్వపు కళింగరాజ్యమందలి వరాహ క్షేత్రములోని పాతాళసిద్ధేశ్వర క్షేత్రమే. ఇదటగల స్వయంవ్యక్త లింగమూర్తి బౌద్ధమత ప్రభావం ఈ ప్రాంతంలోలేని సమయంలో కళింగ దేశాధిశుడయిన విజయసిద్ధి ప్రతిష్ఠించాడు. ఈ లింగమూర్తి వలయాకారపు పానవట్టముపై ఎత్తుగా ఉండి, దర్శనమాత్రమున లింగాకృతి కన్నులకు కట్టి నట్లుండును.

దీనిని క్రీ. శ. పన్నెండవ శతాబ్దంలో వైష్ణవ మతాచార్యుడు శ్రీ రామానుజులు తీర్థయాత్ర సందర్భంగా కళింగదేశం వచ్చాడనీ, శైవులలో మత సంబంధమైన చర్చలు జరిపి శైవులను అవలీలగా వాగ్వివాదంలో జయించి వైష్ణవాలయముంగా మార్చి శ్రీ కూర్మనాథుడని నవీన నామకరణం చేసినట్లు సంస్కృతంలోగల 'ప్రపన్నామృతము' వలన తెలుస్తున్నది. నాటినుండి 'పాతాళ సిద్దేశ్వర' ప్రశంస మాసిపోయి 'శ్రీ కూర్మనాథ' ప్రశంస ప్రబలింది.



ప్రవేశద్వారము 'శ్రీ కూర్మాలయం'

## దేవాలయ ప్రశస్తి:

విష్ణుమూర్తిని కూర్మావతార రూపాన ఇదట పూజించడంవల్ల ఈ దేవాలయాన్ని శ్రీ కూర్మనాథాలయమనీ ఆ గ్రామాన్ని 'శ్రీ కూర్మమ'నీ పిలుస్తున్నారు.

ఈ దేవాలయం చుట్టూగల స్తంభాల మంటపాలలో నల్లరాతితో చెక్కిన రమణీయ శిల్పాలు గలవు. దేవకోష్ఠములందు త్రివిక్రమ, పరశురామ, బలరామ, సరస్వతి, కుబేర, మహిషాసురమర్దిని, ఇంకనూ అనేక శంఖుచక్రధారియైన విష్ణుమూర్తి విగ్రహాలు గలవు. ఈ దేవాలయమందు రెండు ధ్వజ స్తంభాలుగలవు. విమానం చోళరాజుల వాస్తు శిల్పకళారీతులలో నిర్మించారు. చక్కగా కుదురుటచే కాబోలు 'కుదురుకు కూర్మము చిలుకునకు సింహాచలము' అను లోకోక్తి వచ్చింది. శ్రీ కూర్మపురాణం శైవ సంప్రదాయానుసారమై ఉంది. దీనిని రాజలింగకవి మండచిట్టి కామశాస్త్రి ఆంధ్రీకరించారు.



విమానదృశ్యము 'శ్రీ కూర్మాలయం'

## వైష్ణవమత ప్రాబల్యము :

శ్రీ కూర్మం, అరసవిల్లి, సింహాచలం మొదలగునవి ప్రథమంలో శైవమతమునకు పుట్టినిల్లు అయినప్పటికీ ఈనాడు వైష్ణవక్షేత్రాలుగా ఉన్నవి. శ్రీ కూర్మాలయం, సింహాచలాలలో గల శిలాశాసనాలను బట్టి ఆకాలమున నరహరి తీర్థులచే వైష్ణవమతము కళింగమున వ్యాపించెనని తెలుస్తుంది. ఈతని కాలము నాటి శిలాశాసనాలు, శ్రీ కూర్మనాథాలయంలోను, సింహాచలంలోను చాల ఉన్నవి.

## శిలాశాసనాలు :

ఇచటి శిలాశాసనములవలన నాల్గవ శతాబ్దం నుండి పదునాల్గవ శతాబ్దంవఱకు పరిపాలించిన తూర్పు గాంగరాజులచరిత్ర పూర్తిగా తెలుస్తున్నది. క్రీ. శ. 1273 వ సం॥ లో పరిపాలించిన తూర్పుచాళుక్యరాజయిన 'రాజరాజ నరేంద్రుడు' తన ఆస్థానకవి అయిన నన్నయభట్టుని సంస్కృతంలోగల భారతాన్ని తెనిగించవలసిందిగా కోరినట్లు తెలిపే ఒక శాసనం గలదు. ఆనాటి సాంఘిక, రాజకీయ, పరిస్థితులను వివరించే అనేక శాసనాలుగూడ గలవు.

## స్థల మహాత్మ్యము :

ఈ క్షేత్రమహాత్మ్యాన్ని దత్తాత్రేయులవారు వ్యాసమునీంద్రులకు వినిపించారనీ, అందు స్థలపురాణం వలన స్వయంగా శ్రీహరిదత్తాత్రేయులకు శ్రీ కూర్మనాథ మహాత్మ్యాన్నిగూర్చి స్వప్నంలో చెప్పినటు చెబుతారు.

---

# విజయనగర చరిత్ర

## [ రెండవ భాగము ]

డా. నేలటూరు వేంకటరమణయ్య

(గత సంచిక తరువాయి)

రామరాజు శత్రులతో సంధి చేసికొని ద్రోహియైన తనప్రతినిధిని శిక్షించి నిజాధికారమునచట బునః ప్రతిష్ఠించుటకొఱకు సైన్యముతోగూడ వేగిరమె విజయనగరమును చేరబోయెను. అప్పటికి పరిస్థితులు సత్వరమార నారంభించెను. అచ్యుతరాయలు బంధవిముక్తుడై స్వయము రాజ్యకార్యములను నడపుచున్నాడను వార్త విన్నంతటనె నాయకులు పెక్కండ్రు రాజధానికి వచ్చి యతని గూడిరి. ద్రోహియైన రామరాజుయొక్క ప్రతినిధి యచ్యుతరాయలకు మంత్రియై రాయల కార్యఖడ్గములకు కర్తయై రాజ్యతంత్రమునకెల్ల నధినాయకుడై యుండుటను సహింపక సలకరాజు తిరుమలుడాతని వధించి యతని స్థానము నాక్రమించుకొనెను. అది యెఱిగి రామరాజుయొక్క అనుచరులాతని విడనాడి విజయనగరమునకుబోయి రాయల పక్షమును చేరిరి. ఇంతేకాదు విజయనగరమున గలిగిన రాజకీయ సంక్షోభము నదనుచేసికొని రాయసామ్రాజ్యమును జయించుట కదియె తరియని యెంచి యిస్మాయిలాదిల్‌షాహు దండెత్తివచ్చి రాజధానిని ముట్టడించెను. ఇట్టి పరిస్థితులలో విజయనగరమును ప్రవేశించి తన యధికారమును మరల నెలకొల్పుట యశక్యమని తలచి రామరాజు తన నాయంకర భూములకుబోయి యచటినుండి రాజధానియందలి రాజకీయ స్థితిగతుల నరయుచు ననుకూల సమయమును వేచియుండెను.

అచ్యుతరాయలు శత్రువిద్రావణమునకు దగిన బలము దన చేతిక్రిందనున్నను వారిని మార్కొనుటకెట్టి ప్రయత్నమునుసేయక మిన్నకుండెను. అప్పుడు విజయనగరమునకు వచ్చియుండిన పోర్చుగీసు చరిత్రకారు డతని భీరుత్వమును గర్హించుచు నిట్లు వ్రాసియున్నాడు.

'అతడు (యేదుల్ఖానుడు) దళములను సమకూర్చుకొని 12000 కాల్వురతోడను 30000 అశ్వికులతోడను రాయరాజ్యముపైనెత్తి విజయనగరమునకొక లీగునకు తక్కువదూరమున నాగలాపురముకడ విడిసి యా పట్టణమును ధ్వంసముగావించి నేలమట్టమునకు చదునుజేసెను. చెతరావు (అచ్యుతరాయలు) అప్పుడు రాజధానియందే వసించియుండెను. ధైర్యముండిన నంతటి యల్పబలముతో వచ్చియుండిన యాదిల్ఖానుని సులభముగ పట్టి బందీకృతుని గావింప జాలిన సైన్యమతనికడ సిద్ధముగ నుండెను. కాని యతడు పట్టణము వెలుపల దలచూప నోపడయెను. శత్రునెదిర్చి పోటు సూపగుండె దిటవు నాస్తి: కొందఱు దండనాయకులును, నాశ్వికులును తురకలను దాకి యెక్కింత పోటు చూపిరి. వారు రాయల వారిని దఱిసి యంతటి యల్పకార్యమునందు యేలిన వారు స్వయముగ బలిగొన నవసరము లేదనియు శత్రులపై గవయ దమ కాజ్ఞ యొసగిన జాలుననియు విన్నవించిరి. కాని యాతడు భయ విహ్వాల హృదయుడై తన బావమరుదుల సలహామీద యేదులఖానునికడకు రాయబారమంపి సంధి జేసికొన నిశ్చయించుకొనెను.

వాస్తవము నరసి చూడ నచ్యుతరాయలు గాని యాతని బావమరుదులే గాని రణభీరులుగారు. వారు పెక్కు పర్యాయములు రణరంగమున తురుష్కులను హిందువులను నెదుర్కొని ధైర్యసాహసములతో బోరాడి జయముగొన్నవారే. ఏదులఖానుడు నూతన శత్రుడుగాడు. వారిచే నంతకు పూర్వము పరాజితుడైన వాడే. మఱియు నాతడప్పు డెత్తివచ్చి యుండినది స్వల్పసంఖ్యాక దళములతోడనె. అట్టియెడ నచ్యుత రాయలును సతని

మరుమలు సలకరాజు తిరుమల ద్వయమును నేల యాదిల్ఖాను నెదుర్కొనవలసిన నొల్లక సంధిని గోరెను? దీనికొక ముఖ్యకారణము గన్పించు చున్నది. అచ్యుతరాయలెదుర్కొనవలసిన శత్రువొక్క యాదిల్ఖానుడు మాత్రమేకాదు. అతనికంటె ప్రబల విద్వేషి యళియరామరాజు, ఎట్లైన చేజాఱిపోయిన విజయనగర సామ్రాజ్యలక్ష్మిని మరల గైవసము జేసికొనుటకు కతదెన్ని కుతంత్రములనేనియు జేయగలడు. కావున తెగించి తానాదిల్ఖానుపై గవసిన రామరాజతనితో సంధి కుదుర్చుకొని యేకీభవించి తనపైబడి తన్నోడించి మరల బందీకృతునిగ జేయగలడను భయ మచ్యుతుని బాధింపఁగడగినది. అట్టి భయమే రామరాజునుగూడ పీడింపగడగినది. ఆదిల్ఖానుతో యుద్ధమునకు దాను బూనుకొనిన యచ్యుతరాయలతనితో నేకమై యోడించి యప్పుడు దనపాలన క్రిందనుండిన రాష్ట్రమును హరించి తన్ను పదభ్రష్టుని జేయుదురని శంకించి యతడును మిన్నకయుండెను. కావున నేదుల్ఖానునికి విజయనగరముపై నిరవధికముగ నెత్తివచ్చి నాగలాపురమును నాశముసేయను విజయనగరమును ముట్టడించను సాధ్యపడినది. కాని యచట నతడు చిరకాలమాగియుండ వలనుపడకపోయినది. శత్రులవలని ప్రత్యాఘాతము లేకపోవుటవలన నాతనికి దా నప్రతిహత ప్రతాపుడనను దురహంకారము గలిగినది. శత్రులైన హిందువులనేకాక తన వారైన మహమ్మదీయులను సైతమతడు తృణప్రాయులనుగ జూడ గడగెను. సుల్తాను నడవడిక యమీరులకు ముఖ్యముగ పారశీకులకు నాయకుడైన యాసాద్ఖాను లారీ కీసడము గల్గించెను. కావున నాతడాదిలానుని గర్వనిర్వాపణకు మార్గము వెదుక నారంభించెను. మొదట నొక వార్తాహరుని మూలమున రామరాజున కిట్లు వర్తమానము నంపెను.

'నీకేమి చేటు వాటిలినది; ఒక పరియైన పోటు సూపక పలాయితుడవై పోయి వ్రీడాహీనుడవై పందయనిపించుకొంటివి. ఇప్పడైనను నీవు బయలు మెఱసి యుద్ధమునకు వెడలి వచ్చిన ఇబ్రాహీము ఆదిల్ శాహు నీతో పోట్లాడక వచ్చినమార్గమున మరల వెడలిపోవునట్లు మేమేర్పాటు సేయగలము. అట్లుగాక యతడొకవేళ యుద్ధమునకు బూనుకొనినను మేము తటస్థులమైయుండి విజయము నీకు చేకూరునట్లు చేయుదుము. అది యెట్లున్నను నిస్పృహను విసర్జించి సంగరమునకు రమ్ము.'

రామరాజునకు పై వర్తమానమునంపి యాసాఖాను డహమ్మదు నగర సుల్తానగు బుర్హాన్ నిజాముషాహును విజాపురముపై దండెత్తివచ్చి తత్పూర్వ మాదిల్ శాహోతని నోడించి పట్టుకొని యుండిన సీమలకు మరల స్వాధీనము జేసికొమ్మని యాహ్వానించెను. ఆసాదుఖానుని పన్నుగడలకు ఫలితముగ నళియరామరాజు సైన్యముతోగూడ విజయనగరమును ముట్టడించియుండిన యాదిల్ఖానునిపై గవయ వచ్చెను. బుర్హాను నిజాముషాహు విజాపురముపై దండు నడచెను. నిజాముషాహు దండయాత్ర విన్నంతటనె యాదిల్ఖానుని హృదయమున గళవళము జనించెను. తను కొలువు నందుండు తురుష్క సర్దారులెల్లను నిజాముషాహు యొక్క పక్షపాతులని యతడెఱుగును. నిజాముషాహుతో యుద్ధమునకు బూనుకొనిన వారందఱును ప్రత్యక్షముగనో పరోక్షముగనో యతనికి దోడ్పడగలరని తెలియును. ఈ సందిగ్ధావస్థయందు తానేమి జేయవలసినదియు నతడు నిశ్చయించుకొనజాలక పోయెను. ముట్టడి లేవదీసికొని నిజరాజ్యమునకు దరలి పోవుదమన్న రామరాజును నచ్యుతరాయలను దనను వెన్నంటి తఱుముకొని రాగలరు. ఉన్నస్థలమునందే నిలువరించియుందమన్న నిజాముషాహు దన రాజ్యమును నిరవధికము ప్రవేశించి దేశమును ధ్వంసముజేసి రాష్ట్రమున జాలభాగము నాక్రమించుకొనును. ఈ సందర్భమున స్వయముగ నే నిశ్చయమునకును రాజాలక తన సర్దారులను నమీరులను సమావేశమునకు రప్పించి సలహా యడిగెను. వా రందఱును నేకగ్రీవముగ రామరాజుతో సంధిజేసికొని నిజరాజ్యమునకు మరలిపోవుట మేలని పలికిరి.

ఆదిల్ శాహు శిబిరమున నడచిన వర్తమానములన్నియును, నచ్యుతరాయలకును సలకరాజ పుత్రులకును నెఱుకపడినంతటనె యాసాద్ఖానుని కుతంత్రములు నెఱవేరిన దమకు ముప్పు వాటిలునని గ్రహించి రామరాజుతో నతనికి సంధి కుదరకమునుపే తామే యతని సఖ్య మొనర్చుకొనుట శ్రేయస్కరమని యెంచి యతనికడకు రాయబారుల నంపిరి. తన దండయాత్రను గట్టిపెట్టి సత్వరము నిజరాజ్యమునకు మరలిపోవ దహతహపడుచుండుట వలన నతడును సంధి

కొప్పుకొనెను. సంధి షరతులను న్యూనిజిట్లు వివరించి యున్నాడు. అచ్యుతరాయ లాదిల్‌ఖానునికి పదిలక్షల బంగారు పగోడాల నప్పన మీయవలయును. ఇంతియ కాక పూర్వము కృష్ణరాయ లతనిని జయించి గైకొని యుండిన రాయచూరు రాజ్యమును సాలుకు 150000 వర్హావుల ఆయముచ్చు రాష్ట్రముతో గూడ నతనికి మరల నిచ్చివేయవలయును. మఱియును లక్షవరహాల విలువగల యాభరణములను సమర్పించుకొనవలయును. ఈ షరతులకు రాయ లొప్పుకొని దా నచ్యుతరాయలతో నూఱేండ్ల పర్యంతము జెల్లగల సంధిని జేసికొన సంసిద్ధుడనై యున్నాడని యాదిల్‌ఖానుడు తెలియ జేసెను. అందుల కచ్యుతరాయలు సమ్మతించెను. లంతట వారికి సంధి కుదిరెను.

ఈ సంధి సమకూడునప్పటికి రామరాజు విజయనగర పరిసరములకు వచ్చిచేరెను. అచ్యుతరాయ లతో దనకు సఖ్యము గుదిరినను రామరాజుతో నతడు యుద్ధము దలపెట్టలేదు. నిజరాజ్యముపై నెత్తి వచ్చిన నిజాముశాహు నెదుర్కొనవలసియుండుట జేసి యాసాఫ్‌ఖాను ప్రభృతులైన నాయకవర్గ మొసగిన సలహాప్రకార మతనితో సంధిచేసికొనెను. ఇంతియ కాక ప్రస్తుతము దనకు మిత్రుడైన రాయలకును రామరాజుకును మధ్యవర్తియై వారిని రాజీపఱచి సంధి సమకూర్చెను. ఈ సంధి నియమముల ప్రకారము రామరాజప్పుడు తన పాలనక్రింద నుండిన రాష్ట్రమున కంతటికిని స్వతంత్రాధిపతి యాయెను. తక్కిన సామ్రాజ్యమును సమస్తమును నచ్యుతరాయలు నిర్నిరోధముగ పాలింపగల్గెను.

## అచ్యుతరాయల చరమదశ

శత్రుపీడారహితమై దేశమున శాంతి నెలకొని నను ప్రజలకు సౌఖ్యమొడగూడ దాయెను. చరమ దశయందచ్యుత రాయలపాలన ప్రజాకంటకముగ బరిణ మించెను. అతడు స్వయముగ రాజ్యవ్యవహారములను విచారించుటను మానుకొని సర్వకాలములను తన బావ మరదులైన సలకరాజ సోదరుల కప్పజెప్పి యంతఃపురము స్త్రీల సంగతిని కాలము గడపజొచ్చెను. మఱియు వారి సలహానుసరించి రాజ్యమందలి సామంతులను, నాయకు లను, ధనాఢ్యులను హింసించి వారి సర్వస్వమును హరింపగడగెను. పెక్కండ్రు సకుటుంబముగ నశించిరి. అప్పుడు విజయనగరమున వచ్చియుండిన పోర్చుగీసు చరిత్రకారుడు న్యూనిజు అప్పటి స్థితిగతుల నిట్లు వివరించియున్నాడు.

'అతడు (అచ్యుతరాయలు) రాజ్యములోని ప్రముఖులను నాశమొనర్చి వారి సంతతిని నిర్మూలము జేసి వారి ద్రవ్యమును హరించెను. ఆదిల్‌శాహుతో సంధి జేసికొన్నందు వలనను, ప్రజల సమ్మతిలేకుండ వారి ధనమును బలాత్కారమున గైకొనుట వలనను ప్రజల యందతృప్తి ప్రబలెను. విజయనగర సామ్రాజ్య మెన్నడేని విచ్ఛిన్నమై పోయినచో నది యతని కాలము ననే తటస్థించగలదని యందఱు ననుకొన గడగిరి.

కాని యట్టి దురవస్థ కలుగక ముందే దైవోప హతుడై క్రీ. శ. 1542 సం॥ మధ్య నచ్యుత రాయలు పరమపద ప్రాప్తుడాయెను.

చరమదశయందు ప్రజాకంటకుడై ప్రవర్తించి నను అచ్యుతరాయలు దైవభక్తిగలవాడు. కృష్ణరాయల వలె నితడును పరమ వైష్ణవుడు. తాతాచార్యుల వారితని మతగురువు. తిరుపతి వేంకటేశ్వరుడితనికి యిష్టదైవము. కృష్ణరాయలవలెనే యితడును దన రాజ్యకాలమున పలుమారులు తిరుపతికి యాత్రచేసి వెంకటేశ్వరునికి భూకనక భూషణ వస్తువాహనాదు లను సమర్పించి సేవించువాడు. అచ్యుత రాయలను స్వామి సన్నిధానమున దానాదేవుని నిరంతరము సేవించు చున్నట్లు పురుష ప్రమాణమునకు మించిన పంచ లోహకృత నిజ ప్రతిబింబమును దేవాలయ ముఖ మంటపమున నిల్పెను. స్వీయులైన శ్రీ వైష్ణవులనే కాక మాధ్వులను చైతన్య సమయాయుల నాదరించి పోషించెను.

అచ్యుతరాయల కాలమున శ్రీ కృష్ణ చైతన్య స్వామి వారు విజయనగరమునకు విచ్చేసిరి. రాయ లాతని భక్తిపూర్వకముగ సేవించు యతనికి గర్నాట ముననొక గ్రామమునిచ్చి సత్కరించినట్లు శాసనములు దెల్పుచున్నవి. అచ్యుతరాయలు పరమత సహిష్ణువు. శైవులను, జైనులను గౌరవించి దానధర్మములు జేయునెడ పక్షపాతము లేక సర్వసమయముల వారిని సమదృష్టిని చూచువాడు.

అచ్యుతరాయల కాలమున వాస్తుశిల్ప చిత్ర లేఖనములు - జక్కగ వర్ధిల్లినవి. కృష్ణదేవరాయల వలెనే యతడును రాజధానియందును అన్యస్థలము

అందును పెక్కుదేవాలయములను గట్టించెను. విజయ నగరమున విఠ్ఠలేశ్వరుని యాలయ జీర్ణోద్ధారణ కార్యమును కొనసాగించుటయేకాక అచ్యుతరాయస్వామి పట్టాభిరామాలయములను, క్రొత్త దేవగృహములను నిర్మించెను. రాజ్యారంభమందే తిరుపతియందు కపిల తీర్థమునకు తాకట్టు సోపానములను గట్టించెను. బ్రాహ్మణులు సంధ్యావందనార్థమీ తీర్థమునకు బూర్వపశ్చిమములందు సంధ్యావందన మండపములను పట్టణమందచ్యుతరాయలు పెరుమాళ్లగుడి నెత్తించి దానిచుట్టు నొకబ్రాహ్మణాగ్రహారము నేర్పఱచెను. రాయలననుసరించి సామంతులును నధికారులు గూడ వాస్తు నిర్మాణ కార్యమును దలపెట్టిరి. ఈ సందర్భమున ముఖ్యముగ బేర్కొనదగిన వాడు విద్యానగర తలవరి పెనుగొండ విరూపణ్ణ. ఇతడిప్పటి యనంతపుర మండలములోని లేపాక్షియందు తన యిష్టదైవమైన శివునికొఱకు శిల్పచిత్రలేఖనలకు బ్రసిద్ధినందిన దేవాలయ మెత్తించెను.

అచ్యుతరాయల కాలమున గీర్వాణాంధ్ర వాఙ్మయములు చక్కగ నభివృద్ధి జెందినవి. అన్న కృష్ణరాయలవలె స్వయమాతడు కవిగాక పోయినను భాషాసేవ యందతనికి వెనుకబడలేదు. ఇతని యాస్థానమున వెలసిన సంస్కృత కవులలో ముఖ్యముగ బేర్కొనదగిన వారిరువురు కలరు. మొదట నెన్నదగిన వాడితని యాస్థానకవి రాజనాథ డిండిముడు. ఇతని కృతులు రెండు. అచ్యుతరాయాభ్యుదయము, భాగవత చంపువు. అచ్యుతరాయాభ్యుదయము చారిత్రక కావ్యము. అచ్యుతరాయల చరిత్రయందు కావ్యరూపమున వర్ణింపబడినది. అన్యచరిత్రాధారములందు కానరాని యంశములను డిండిముడిందు వివరించియున్నాడు. సమకాలిక పోర్చుగీసు రచనలు డిండిముని కావ్యము సత్యాత్మకమైన చరిత్ర గ్రంథమని రుజువు సేయుచున్నవి. భాగవతచంపునందు శ్రీ కృష్ణపరమాత్ముని కథ సంగ్రహముగ వర్ణింపబడినది. ఇది యింకను ముద్రితము గాలేదు. ఇది ప్రచురమైనగాని దీనికి విలువ కట్టవలనుపడదు. అచ్యుతరాయల యాస్థానమున వెలసిన రెండవ గ్రంథకర్త ఓదువ తిరుమలాంబ. ఓదువయన గన్నడమున చదువునది యనగా బాలకురాలని యర్థము. రాయలవారు ప్రతి రాత్రియు న్నిద్రించు దనుక గ్రంథపఠనము సేయుట యామె పని. తిరుమలాంబ విదుషీమణి. సంస్కృతమునందు కూలంకష పాండిత్యము గలిగి చక్కని కవిత్వము జెప్ప నేర్చిన ప్రతిభాశాలి. ఈమె యచ్యుతరాయల దేవేరుల యందొకర్తెయైన తిరుమలాంబ యని కొందఱి యభిప్రాయము. ఇది సరియె కావచ్చును. ఈమె వరదాంబికా పరిణయమను గొప్ప చంపుకావ్యమును విరచించెను. సాహిత్యదృష్టియం దెట్లో చారిత్రదృష్టి యందును నట్లే వాసి కెక్కినది. అచ్యుతరాయల పట్టమహిషి యైన సకలరాజపుత్రిక వరదాంబికయొక్క వివాహ మిందు వర్ణింపబడినది. తిరుమలాంబ చక్కని చారిత్రిక దృష్టిగల రచయిత్రి. తాను కన్నులార గాంచిన పెక్కు చరిత్రాంశముల నిందు వర్ణించినది. వరదాంబికా పరిణయము గంగాదేవి విరచితమైన మధురావిజయ మంతటి గొప్ప కావ్యము కాకపోయినను సంస్కృత సాహిత్యమునందు దీని స్థాన మున్నతమైనదే.

అచ్యుతరాయలాంధ్రభాషయందు పెక్కు గ్రంథములను రచియింపజేసెను. అతడు ప్రతి సంవత్సరమునను శ్రీ వేంకటేశ్వరునకు సత్కావ్య ప్రబంధపుష్పాంజలి సమర్పించుచు గీర్తి సుకృతంబుల నిర్వహించుకొనెనని రాధామాధవ కవి వక్కాణించియున్నాడు. ఆ సత్కావ్య ప్రబంధము లెవ్వియో తెలియరావు. కాని యితని కాలమున దిరుపతియందు తాళ్లపాక కవులు కావ్యరచనను బహుళముగ సాగించిరి. వారిలో ముఖ్యముగ జిన్నన్న యనబడు తిరువెంగళనాథకవి. ఇతడు పరమయోగి విలాసాష్టమహిషీ కల్యాణాది యుత్తమ పద్యకావ్యములను శ్రీ వేంకటేశ్వరున కంకితముగా విరచించెను. ప్రాయశః ఇవి యచ్యుతరాయల ప్రోత్సాహమున రచింపబడియెనేమో. ఇచట స్మరింపదగిన కవిసత్తముడు మఱియొకడు గలడు. ఇతడు చింతలపూడి యెల్లయార్యుడు. రాధామాధవ కావ్యమును కృష్ణరాయల సభలో జదివి వినిపించి రాయలచే రాధామాధవుడను బిరుదు గొనెనని పూర్వ ప్రకరణమున దెల్పియున్నాడను. రాధామాధవము గాక విష్ణుమాయా విలాస నాటకమున తారక బ్రహ్మ రాజీయమునను మఱి రెండు కావ్యములను వ్రాసి యున్నాడు. విష్ణుమాయావిలాస నాటకము శ్రీ మహావిష్ణువుయొక్క మాయాశక్తి మహత్వమును బ్రకటించు షడ్యకథాసముచ్చయము. తారకబ్రహ్మ రాజీ

యము రామభక్తిపరమైన కావ్యము. ఎల్లయార్యుడు పదునాఱవ శతాబ్దమున వెలసిన యాంధ్రకవులలో నగ్రశ్రేణికి జెందినవాడు. ఇతనిచే విరచితమైన కావ్య త్రయమందును విష్ణుమాయావిలాసము గడు శ్రేష్ఠమైనది. ఆ యుగమున వెలువడిన యాంధ్రకవులలో దీని స్థాన మత్యున్నతమైనది. భాషామాధుర్యముననేమి, పదలాలిత్యమందేమి, వర్ణనావైచిత్రియందేమి, కథా సంవిధానమునందేమి దీనికి సాటివచ్చు కావ్యములు పెక్కు గానరావు.

## వెంకటాద్రి (1542–3)

అచ్యుతరాయల మరణానంతరము వతని యేకైక పుత్రుడు వేంకటాద్రి రాజ్యాభిషిక్తుడాయెను. వేంకట దేవరాయలు శాసనములందు పేర్కొనబడియున్నాడు. ఆధునిక చరిత్రకారు లతని వెంకట యందురు. రాజ్యాభిషిక్తుడైనపు డితడు ద్వాదశవర్ష వయస్కుడైన బాలుడు. క్రీ. శ. 1532 లో నచ్యుతరాయలు కంచికిబోయి యుండినప్పుడు తండ్రితోడను తల్లియైన వరదాజియమ్మలోగూడను నితడచట ముక్తిక తులాభారము తూగినట్లుచట నొక శాసనమునందు చెప్పబడియున్నది. రాజ్యాభిషేక మప్పుడు వేంకటాద్రి నిర్వాహకము చాలని బాలుడగుటచేత నా సమయమున రాజధానియందు సమావేశితులైయుండిన సామంతులు నాయకులు మున్నగు ప్రముఖులతని పక్షమున సామ్రాజ్య కార్యములను నిర్వహించుట కొకమంత్రివర్గము నేర్పఱచిరి. కావున వారు చేసిన యేర్పాటు రాయలమాతులులైన సలకరాజ తిరుమలరాజ ద్వయమునకు నచ్చకపోవుటచేత వారలా మంత్రివర్గమును ద్రోసిపుచ్చి రాజ్యమందలి సర్వాధికారముల నాక్రమించుకొని నిరంకుశ వృత్తిని బ్రవర్తింప గడగిరి. వారి యక్రమ ప్రవర్తనను సహింప జాలక సామంతాదులు వారి సీమలకు మరలిపోయి సలకరాజు వారి యధికారమును ధిక్కరించి యెవరికి వారే స్వతంత్రులై వ్యవహరింప గడగిరి.

రాయమాత వరదాదేవికి దన సోదరులు ద్రోహము దలపెట్టి పసివాడైన తనకుమారుని దొలగ ద్రోసి రాయపదము నాక్రమించుకొన నుద్యమించుచున్నారను శంకగలిగినది. కావున నామె విజాపుర సుల్తానుడైన ఇబ్రాహిమ్ ఆదిల్‌శాహునకు సామ్రాజ్యమును దన సోదరులకు హస్తగతము గానీయక తన పుత్రున కొడగూర్చిన నపరిమిత ధన సంచయమును సమర్పింతునని రాయబారుల మూలమున వర్తమానము నంపెను.

ఆ వర్తమాన మందగనే ఇబ్రాహీమాదిల్ శాహు కడుముదితుడై సైన్యమును గూర్చుకొని విజయనగరముపై దండు వెడలెను; కాని సలకరాజ సోదరులు ఆదిల్‌శాహునకు మితిలేని ధనమునిచ్చి యాతనిని వెనుకకు వరల్చిరి. వరదరాజమ్మ కుమారుని సంరక్షించుటకు జేసిన ప్రయత్నము విఫలమైపోయినది. సలకరాజు వారంతట సామ్రాజ్యమునకు దామె యొడయులైనట్లు పరిపాలన సేయగడగిరి.

సలకరాజు వారిట్లాదిల్‌శాహును వెనుకకు మరల్చి రాజ్యాంగమును సమస్తము నాక్రమించుకొన దలపెట్టినను వారి పూనిక నిర్విఘ్నముగ గొనసాగలేదు. రాయసామంతులును సమరనాయకులు పెక్కండ్రును వారి యధికారము నంగీకరింపక ప్రతిఘటించిరి. మఱియు రామరాజు అచ్యుతరాయల మరణానంతర మాని పుత్రుడైన వేంకటాద్రియొక్క రాజ్యాభిషేకమునకు సమ్మతించక యచ్యుతరాయలయన్న శ్రీరంగరాయల పుత్రుడైన సదాశివుడె రాజ్యమునకు న్యాయమైన వారసుడని ప్రకటించి యతనిపేర రాజ్యము నాక్రమించుకొన బ్రయత్నములు సేయ గడగెను. తన తాత్కాలిక సత్త్వహీనతచేతనో మఱి యే కారణమువలననో రామరాజు సలకరాజు తిరుమలరాజులపై నడువక బిజాపుర సుల్తానును విజయనగరముపై దండు వెడల బురికొల్పెను. ఇబ్రాహిమ్ ఆదిల్‌షాహున కప్పుడు విజయనగరముపై దండు సేయుట మంచినీళ్ల మర్యాదయైనది. కావున నతడు వెంటనే కొంత సైన్యమును పోగు జేసికొని దండు వెడలివచ్చి విజయనగర ప్రాంతమున విడిసెను.

విజయనగర ప్రజలు శత్రుని రాకను గాంచి కళవళమంది తమ పట్టణ సంరక్షణకు మార్గము వెదుక దొడగిరి. పసిబాలుడైన వెంకటాద్రి దేవరాయలకు స్వయముగ శత్రు నిగ్రహణమునకు శక్తి చాలదనియు నతనికి బ్రాపైన సలకరాజవారు స్వార్థపరులగుట కారణమున తమ యావచ్ఛక్తిని వినియోగించి యుద్ధము సేయక పోవచ్చుననియు శంకించి వారికే పట్టము గట్టుట మేలని నిశ్చయించిరి. అప్పటికి సలకరాజు పెదతిరుమలరాజు పరలోకగతుడై పోయినందున పురజనులంద రేకమై

యతని తమ్ముడైన చినతిరుమల రాజునకు శకాబ్దము 1474 నకు సరియైన శుభకృత్సంవత్సర పుష్య శు 11 మాఘ 14 ల మర్య నతనికి బట్టముగట్టిరి. అంతట నతడు దండుతోగూడ పట్టణము వెలువడి తత్సమీపమున విడిసియుండిన శత్రుసైన్యముపై దారసిల్లి నిర్జితులగావించి పాఱదోలెను. విజయుడై మరల రాజధాని బ్రవేశించి తిరుమలదేవ మహారాయలు దనపేర రాజ్యపాలనము సేయనారంభించెను. కాని సింహాసనముపై యతని స్థాన మింకను స్థిరస్థాపితము గాలేదు. శత్రుభయమువలన రాజధానియందలి పౌరులు దన్ను రాయపట్టమున కభిషిక్తుని జేసినను శత్రువు పరాజితుడైపోయిన పిమ్మట వారు భయవివర్జితులై పసిబాలుడైన వెంకటాద్రికి దాము తలపెట్టిన ద్రోహమునకు పశ్చాత్తాపతప్తులై వారు మరల నాతని రాయపదముననె నెలకొల్పి తన్ను పదభ్రష్టుని గావించునను శంక తిరుమల రాయలను పీడించగడగినది. వెంకటాద్రి యుండునంత కాలమును దన పదవి స్థిరము కాజాలదని యెంచి యతని బాల్యమును బంధుత్వమును బరిగణించక హంతకుల నియోగించి యతనిని హత్య జేయించెను. అంతటితో దృప్తిపడక సింహాసనమునకు వారసు లనదగిన రాజబంధువుల నెల్ల హతము గావించెను. ఇట్టి యత్యాచారముల కొడిగట్టినను సింహాసనముపై తిరుమల రాయలు సుస్థిరముగ నెలకొని రాజ్యమును పాలింపజాలడాయెను.

రామరాజు తిరుమల రాయలపై యాదిల్ శాహును బురికొల్పి యంతటితో దృప్తుడై మిన్నక యుండలేదు. తిరుమల రాయల నోడలేక యతనిమీద, విజయమందిన పక్షమునం దాదిల్‌శాహునో తఱుము గొట్టె విజయనగర సింహాసనము నాక్రమించుకొన గృతనిశ్చయుడై యాతడు బలముల సమకూర్చుకొన నారంభించెను. అతని సోదరులైన తిరుమల వెంకటాద్రు లిర్వురును నతనికి కుడి యెడమ భుజముల వలె బ్రాపై నిలిచి యతనికి దోడ్పడిరి.

రామరాజు అప్పటివఱకును తాను నెలవీడు చేసికొనియుండిన గుత్తి దుర్గమునుండి బయలువెడలి రామరాజ్యమునందు బ్రధాన దుర్గమని యెన్నిక కెక్కిన పెనుగొండపై దండు నడచెను. సలకరాజు తిరుమలుని పక్షమున నప్పుడా దుర్గము నెవరు సంరక్షించుచుండిరో తెలియదు. కాని యతడు రామరాజు ధాటి కాగజాలకతని దుర్గమును గైవసము గావించి చనెను. బ్రప్రథమున నతడు సుగిరిని (పెనుగొండను) సాధించెనని శాసనములు సాక్ష్యములు బల్కుచున్నవి. ఈ విజయ సూచనగ నతడు పెనుగొండ దుర్గ సాధక యను బిరుదమును ధరించెను. పెనుగొండ కైవసము జేసికొనిన పిమ్మట నతడు దన యనుయాయుల నెల్ల నచట సమావేశపఱచెను. ఆ సమావేశమునకు వచ్చిన వారిలో నౌకునంద్యాలకోవలకు జెందిన రామరాజు యొక్క జ్ఞాతులును, పెమ్మసాని తిమ్మనాయుడు, హందె హనుమప్పనాయుడు, మేసా పెద్దనాయుడు, మజ్జూరి తులసిపతిరెడ్డి మున్నగు నాయకులును ప్రముఖులు. సమావేశితులైన స్వపక్షమువారి కెల్లరకును రామరాజు సలకరాజు తిరుమలరాయని యత్యాచారముల నెల్ల వివరించి చెప్పి యా ప్రజాపీడకుని సింహాసనమునుండి ద్రోసిపుచ్చి యతని స్థానమున న్యాయవిహిత వారసుడైన సదాశివరాయని బ్రతిష్ఠించుట ధర్మమనియు నట్లొకార్యమును నెఱవేర్చుటకు దోడ్పడినవారికెల్ల దగిన ప్రతిఫలము ముట్టగలదనియును నచ్చజెప్పిరి. అందఱును సమ్మతించిరి. అంతట రామరాజు పెనుగొండ దుర్గ సంరక్షణను విశ్వాసపాత్రులైన స్వానుచరుల కొప్పగించి యచటినుండి బయలువెడలి గండికోట జేరి యచట విడిసి విద్యానగరముపై నడచుటకు వలయు సంభారములను సమకూర్ప నారంభించెను.

రామరాజు పన్నాగములు సలకరాజు తిరుమలుని కెఱకపడకపోలేదు. అతడును రామరాజును హతమార్చుటకు దగు సన్నాహములు జేయుచుండెను. రాయరాణువ యతని క్రింద నుండెను. సలకయ చింతగుంట రఘుపతి మున్నగు నాయకులు పెక్కండ్రాతనికి బాసటయై నిలిచి యాతని పక్షమున బోరుటకు సంసిద్ధులై యుండిరి. రామరాజింకను బ్రబలుడుగాక మునుపే యాతని మట్టుపెట్ట నిశ్చయించి సలకరాజు తిరుమల రాయలు దన బలములనెల్ల సమకూర్చుకొని గండికోటపై నడచి దుర్గాధ్యక్షుడైన పెమ్మసాని తిమ్మానాయని రామరాజును దన కప్పగింపుమని యాజ్ఞాపించెను. తిమ్మానాయడందుల కియ్యకొనక చుట్టుప్రక్క పాళెగాండ్రు ఫౌజులను సమకూర్చుకొని రామరాజును ఘుందుంచుకొని యుద్ధమునకు బయలుదేరెను. ఉభయ పక్షముల బలములును తాడిపత్రికి పశ్చిమము నందైదాఱు మైళ్ల దూరమున నుండు

కోమలి గ్రామము కడ దారసిల్లినవి. పోరు ఘోరముగ జరిగినది. ఇరుతెగల సైనికులు వీరావేశముతో పోరాడిరి; కాని తుదకు సలకరాజు తిరుమల రాయల దళములు విఱిగి వెన్నుచూపి పాఱితెంచినవి. పాఱిపోవుచున్న సైనికులను సమకూర్చుకొని తిరుమలరాయలు వెనుదిరిగి విజయనగరమునకు మరలి పోయెను. విజయుడైన రామరాజతని వెన్నంటి తఱుముచు బోక, కోమలి రణక్షేత్రమునుండి యుత్తరాభిముఖుడై కందనవోలు రాజ్యముపై నడచెను. అతడట్లు పోవుటకు గారణములు రెండు ద్యోతకమగుచున్నవి. 1) కందనవోలు రాజ్యమారెవీటి వంశ్యుల టెంకిపట్టు. ఆ కందనవోలును దాని పరిసరములు నారెవీటి బుక్కరాజు రామరాజు శ్రీరంగరాజు యొక్క నాయంకరసీమ—అవుకుప్రాంతము బుక్కరాజు రామరాజు తిరుమలు లేక తిమ్మరాజుయొక్క యేలుబడి. నంద్యాలయు దాని చుట్టుపట్టు ప్రదేశములును బుక్కరాజు నరసింగరాజు వంశజుల యమర మాగాణము—కావున, రామరాజు తాను మొదట కందనవోలునకు బోయిన తనవారెల్ల సులభముగ దన్ను గూడ నవకాశము గల్గును: వారు తన్ను జేరిన దన పక్షము బలవత్తరమగును. 2) శత్రు పక్షమునకు జెందిన నాయకులు కొందఱు కందనవోలు రాజ్యమునం దమర మాగాణముల ననుభవించుచు సలకరాజు తిరుమల రాజునకు బ్రాపై యుండిరి. వారిని నిర్మూలము సేయక సలకరాజు తిరుమలుని వెను దగిలి విజయనగరముపై గూచి చేసిన యెడల వారి వలన దనకు బ్రక్కపోటు తగులక తప్పదు. పై రెండు కారణములవలన రామరాజు కందనవోలునకు బోవుటయే మేలని యెంచి యట్లే సైన్యమును గదల్చుకొని బయలుదేరెను.

కందనవోలు ప్రయాణము నిరవధికముగ సాగలేదు. మార్గమునందచట శత్రులడ్డుపడి పోటు చూపిరి. కోవులకుంట్ల తాలూకాలోని యవుకు పరిసరములందు యుద్ధము తీవ్రముగ నడచినట్లున్నది. అవుకు రామరాజునకు పితృవ్యుడైన బుక్కరాజు తిరుమలరాజుయొక్క ముఖ్యనగరము. అతడు సంకయ తిమ్మాసురుని వలన గల్గిన ప్రళయ జలధియందు దగుల్కొని విహ్వలమందుచుండిన వసుధామండలమును నిల్వరించిన ధరణీ వరాహుడని సమకాలిక ప్రబంధకర్తలచే బొగడ్తనంది యున్నాడు. అవుకు ప్రాంతమునుండి బయలు వెడలిన బేతంచర్ల జూటూరు బెడగల్లు ఆదవని దుర్గములకడ రామరాజునకు శత్రులతో ఘనమైన పోరాటము గల్గెను. బేతంచర్లకడ చింతగుంట రఘుపతియు జూటూరు బెడగల్లుల చెంత సలకయయు రామరాజు నెదిర్చి పరాభూతులై పాఱితెంచిరి. ఈ విజయముల వలన కందనవోలు రాజ్యము సమస్తమును శత్రు వివర్జితమై రామరాజునకు హస్తగతమాయెను. అంతనాతడు పశ్చిమాభిముఖుడై తుంగభద్రానదీతీరముననె దండు నడుపుకొని యాదవానికిబోయి యా దుర్గమును ముట్టడించెను. విజయనగర సామ్రాజ్యమందలి శత్రు దుర్భేద్య దుర్గములలో నాదవాని ప్రథమ శ్రేణికి జెందినది అది యప్పుడు సంజీవ (సంజారు) ఖానుడను తురుష్కుని యాధిపత్యము క్రింద నుండెను. ఇతడెవ్వరి పక్షమున ఆదవానిని పాలించుచుండెనో విశ్చయించి చెప్పుటకు వీలుపడలేదు. ప్రాయశః ఇతడు సలకరాజు తిరుమలరాయల యనుచరుడు కావచ్చును. సంజీవఖానుడు రామరాజు నెదిర్చి తన యావచ్ఛక్తి వినియోగించి పోరాడెను. కాని యుద్ధమున రామరాజు బలము తాకునకు నిలుపోపక వెన్నుచూపి పలాయితుడాయెను. అంతట నాదవాని దుర్గము రామరాజునకు గైవసమాయెను. ఈ యుద్ధములం దిన్నిటను గండికోట పెమ్మసాని యక్కనాయని చిన తిమ్మానాయడు రామరాజునకు బాసటయై నిల్చి జయము చేకూర్చినట్లున్నది.

'జూటూరుకాడను శూరత్వ మేర్పడ
రణభూమిలో సల్కరాజు గెల్చె
కోరి బేతముచెర్లకోట ధూళిగజేసి చింత
గుంట్రఘుపతి పంతమణచె
బెడకంటికాడను భీకరాహవముగా వెండియు
సల్కని విఱుగదోలె
సాహసుడైనట్టి సంజీవఖానుని విదళించి
యపుడాదవేని గొనియె.'

నని సమకాలిక యజ్ఞాతకవియొక్కడీ చినతిమ్మానాయని ప్రశంసించియున్నాడు.

ఆదవేని దుర్గము స్వాధీనమైన పిమ్మట రామరాజచట కొంతకాలమాగి విజయనగరముపై నడచుట కుద్యుక్తుడై కందనవోలు గద్వాలు మున్నగు స్థలములనుండి బలములను సమకూర్చుకొనెను. ఆదవేని దుర్గమును బలపఱచెను. అప్పుడే కాబోలు నతడచట

శుక్రవారపుపేటకు బునాదులు వైచినది. సైన్యమును యద్ధసామగ్రిని సమకూర్చుకొనిన పిమ్మట రామరాజు సలకరాజు తిరుమలుని తుది పోరాటమునకు విజయ నగరముపై దండు నడచి యచిరకాలముననె తత్పరిసర ముల జేరెను. రామరాజు రాజధాని చెంతకు వచ్చుచున్నా డను వార్త తెలియవచ్చినంతటనె సలకరాజు తిరు మలుని హృదయమున భయాము పెల్లుబేగినది. తనకు సహాయులైన వారెల్లరును రామరాజు యుద్ధ మున నిహతులైరి. తానొక్కడే యాతని నెదిర్చి జయించుటకు సాధ్యముగాదు. ఆయాపదను గడు చుట కాతనికి మార్గమొక్కటియే కన్పించినది. ప్రబలుడైన విజాపురసుల్తాను ఆదిల్‌శాహుయొక్క సహాయమునర్థించుటయే ఈ విషయమును ఫెరిస్తా యిట్లు వివరించి యున్నాడు. 'శత్రుల పన్నాగములు దెలిసి వచ్చినంతటనె తిరుమలరాయలు విజాపుర సుల్తాను ఇబ్రాహీమ్ ఆదిల్‌శాహుకడ కాఱులక్షల హొన్నులను మఱికొన్ని యమూల్యమైన కానుకలతో గూడ రాయబారులనంపి తనకు తోడ్పడ కూచివేసి రావలయుననియు నట్లు వచ్చిన తానందుకు బ్రత్యా మ్నాయముగ సుల్తాను కరిగాపగుదుననియు నతని యాగమన ప్రయాణమప్పుడొక్కొక్క దినమునకగు ఖర్చులకు మూడు లక్షల హొన్నులను జెల్లింతు ననియు సందేశము నంపెను. ఆ సందేశమును వినగనే ఇబ్రాహీము ఆదిల్‌శాహునకు పేరాశ పెచ్చుపెరిగినది. విజయనగర సామ్రాజ్యము వంతటిని కబళింప నిచ్చపుట్టి నది. ఆసాదుఖాను లారీని సలహా యడిగెను. అంతటి మహదవకాశము మరల కలుగబోదనియు వెంటనే సలక రాజు తిరుమలరాయలు కోరిన మేరకు అతనికి సహాయ మంపుట యుక్తమనియు నతడు హితము జెప్పెను. అంతట నిబ్రాహీమాదిల్‌శాహు సైన్యముతో గూడ బయలుదేరి కతిపయ దినములకు విజయనగరమునకు వచ్చి చేరెను. మార్గమధ్యమునం దడ్డంకులు లేకపోవు టనే నతని ప్రయాణము సునాయాసముగ సాగినది.

ఆదిల్‌శాహు విజయనగరము జేరగనే తిరుమల రాయలతని నెదుర్కొని స్వాగతము చెప్పి తన వెంట రాచనగరికి గొనిపోయి రాయల వజ్రసింహాసనముపై గూర్చుండబెట్టి, యొక్కవారము పొడుగునను మహో త్సవము గావించెను. ఈ దుర్ణయమువలన తుఫాను తాకుచే సముద్రమువలె విజయనగర సామ్రాజ్య మంతయు గలగుండు వడివది. కాని రామరాజును నతని యనుచరులును నితర రాయసామంతులును గళవళమునందక ప్రవాహన కడంగు ప్రబలి తీవెలవలె నమ్ములై యుక్తి యుక్తముగ బ్రవర్తించిరి. తాము చేసినది తప్పనియు, దమ తిరుగుబాటునకు బశ్చా త్తాప పడుచున్నారమనియు దమ్ము క్షమించిన నిక నట్టి తప్పెన్నడును సేయుమనియు దురకలను రాజ్యములోనికి దెచ్చిపెట్టుకొనుటవలన దేశమునకును జాతికని నింతింత యనరాని ముప్పు కలుగగలదనియు నతనికి నచ్చునట్లు లేఖలు వ్రాసి యంపిరి. తిరుమల రాయలు వారి వాక్యములను విశ్వసించి యిబ్రాహీ మాదిల్ శాహునకే బదిలక్షల హొన్నులను సమర్పించి యతనిని సైన్యముతోగూడ నిజరాజ్యమునకు మరలి పొమ్మని విన్నవించెను. అతడిచ్చిన ధన మును వస్తువాహన భూషణాదులనుగాంచి సంతృప్తుడై యాదిల్‌శాహు దన రాజ్యమునకు సైన్యమును గదల్చుకొని మరలిపోయెను. అతడు గడి దాటి తన రాజ్యమునం దడుగుపెట్టెనో లేదొ రామరాజును నతని యనుచరులును దమ బూటక ప్రవర్తనను విసర్జించి వాస్తవ స్వరూపమును వెలువరించి తిరుమల రాయల సైనికులకు లంచము లిచ్చి వశపఱచుకొని యతని వధింపదలపెట్టి సత్వరము విజయనగరముపై నడచి యా పట్టణమును ముట్టడించిరి. తరువాత నడచిన వృత్తాంతము పలువురు పలుదెఱగుల వర్ణించియు న్నారు. అందు ఫెరిస్తా కథనము విపులమును సుపరిచితము నగుటవలన నదియే వాస్తవాత్మకమని సామాన్యముగ విశ్వసింపబడుచున్నది. అతని యాఖ్యానము బడి నడచిన సంగతి యిది. భోజ్ తిరుమల రాయలు దన్నెల్లరును వంచించి శత్రుపక్షమును జేరినారని తెలిసికొని చేయునది లేక రాచనగరులో ప్రవేశించి ద్వారములను బంధించుకొనెను. చిత్తవైకల్యము సంప్రాప్తముకాగా ఏనుగులును, గుఱ్ఱములను శత్రుల కుపయోగము గాకుండ కండ్లను బొడిపించి తోకలను నఱికించెను. వందలకొలది యేండ్లనుండియు రాయభండారమున నిక్షిప్తమైయుండిన వజ్రమరకత పద్మరాగ ముక్తా ఫలాది మణులను పెద్ద తిరుగళ్లబోయించి పిండి యగునట్లు విసిరించి యా పిండిని నేలపై జల్లిం చెను. తరువాత దానున్న హర్మ్యస్తంభమునం దొక దానికి ఖడ్గమును బంధించి దానిమొన దన వక్షస్థల మున నాటి వీపున దూయునట్లు వేగమె బరుగిడుచు

వచ్చి దానిపై నుఱికి యసువుల బాసెనో లేదో యప్పుడె శత్రులు నగర వాకిళ్లను దెరిపించి లోనికి ప్రవేశించిరి.

ఫెరిష్తా కథ సత్యమైనదని నమ్ముటకు వలను పడదు. ఏలనగా సమకాలికాంధ్ర రచయితలు సలకరాజు తిరుమలరాజు యుద్ధమున జంపబడినట్లు చెప్పి యున్నారు. దోనేరి కోనేరి నాథుఁడు, రామరాజు

'ఏపున ద్రోహి భావము వహించిన
సల్కయ తిమ్మరాజు ద
త్పాప సహాయ సల్కయ యుతంబు
శౌర్యము మీఱ ద్రుంచి'

—యనియు,

రామరాజ భూషణుడు,

'ఖలజన' స్థానవాసుల బల్వుర వధించి
మహిమసల్కా ఖరస్మయము మడంచి
హరి వీరభట మహోద్ధతి నబ్ధి గంపింప
దురమున గదిసి తద్ద్రోహియు దునిమి—

—యనియు

మూర్తికవి,

'ఖలునతి ద్రోహి సల్కయ తిమ్మని హరించి సకల
కర్ణాట దేశంబు నిలపె' యనియు,
రామరాజు రంగప్ప, 'మహినెవ్వారెన సల్కరాజు
చిన తిమ్మక్ష్మాప కంతారుణాం
బుహ విశ్వర్వణ తర్పితాసి శిఖికిన్......
రామప్పకున్, యని జెప్పియున్నారు

కావున సలకరాజు తిమ్మరాజు వీరోచితమైన రణమరణమును పొందెననియు ఫెరిష్తా వచించినట్లు పిచ్చివాఁడై యాత్మహత్య జేసికొనలేదనియు మనమను కొనవచ్చును. ఈ యుద్ధము రాజధాని విజయ నగర పరిసరములందు తుంగభద్రానదీ తట మునం దెచటనో నడచినది. మిత్రులును నను చరులు మునుగుచున్న యోడనుపరిత్యజించి పాఱిపోవు మూషికవర్గమువలె విడిచిపాఱఁగా సలక రాజు తిరుమలరాజు ధైర్యము గోలుపోక రామ రాజుతో మరం నొకపరి యుద్ధము సేయ నిశ్చ యించుకొనెను. పోయినవారు పోగా నింకను నన్నాశ్ర యించియుండిన స్వల్పసంఖ్యాకులైన సైనికుల బోగు చేసికొని రాజధానినుండి వెలువడి శత్రుని యునికి పట్టు నన్వేషించుచు బోయి తుంగభద్రా తీరమునం దొకచోట విడిసెను. ఆ లోపల నాదవేనియందో తత్పరి సరముఁనందో విడిసియుండిన రామరాజు సలకయ తిరుమలరాజుయొక్క యునికిపట్టును నతని సైన్య సంచారణ మార్గమును గనుగొనుటకును నతని యను చరులను మాయచేతను లంచముల నిచ్చియు నతని నుండి వేర్పఱచుటకొఱకును వేగరులను సలకరాజు తిరుమలుడు క్షత్రియుఁడు గాడనియు గొల్లవాడనియు నొక కింవదంతిని బ్రసరింపజేసెను. చారులవలన దిరుమలరాజు స్కంధావారముడిగి యుండు తావును గనుఁగొని యకాయకి దండు నడపుకొనిపోయి యక స్మాత్తుగ నతనిపైఁ గవిసెను. యుద్ధము ప్రారంభ మాయెను. తిరుమలరాజు దళనాయకు లతని విడిచి పలాయితులైరి. ఇఁక యుద్ధమున శత్రునితో బోర దలఁచుట శ్రేయస్కరము గాదని యెంచి, విశ్వాస పాత్రులైన యనుచరులు కొందఱు వెంటరా రణ భూమినుండి పాఱిపోవుచుండఁగా, రామరాజు సేనాధి పతు లతని ఁజిమి పట్టుకొని శిరచ్ఛేదమొనర్చి, ఖండితమైన శిరము నొక గడకొనగ్రుచ్చి పైకెత్తిరి. అంతటితో సమాప్తమైనది సలకరాజు తిరుమల రాయల రాచరికము.

## సదాశివరాయలు (1543-70)

విజయుఁడై రామరాజు సదాశివరాయలతోడను బంధుమిత్ర బలగముతోడను, రామరాజు విద్యానగర మును ప్రవేశించెను. సలకరాజు తిరుమలరాజుయొక్క యమానుష కృత్యములను సహింపజాలక యలజడి నందిన పౌరులాతని మరణవార్త విని సంతసించి రామరాజునకు ఘనమైన స్వాగతమిచ్చిరి. తరువాత నల్పకాలములోపలనె రామరాజు సదాశివరాయలను వజ్ర సింహాసనముపై గూర్చుండబెట్టి పట్టాభిషేక మహో త్సవమును గడువైభవముతో జరిపెను. ఈ సదాశివ రాయలు విజయనగర సామ్రాజ్యము నేకఛత్రాధిపతియై పాలించినట్లు శాసనములు దెల్పుచున్నవి; కాని యిది కేవలము పైబటారమె; వాస్తవము బరికించి చూడ నితని రాజరికము నేతి బీరకాయవంటిది. ఇతడుశ్త యంబేద సత్వహీనుడు; మందబుద్ధి. కావున నితడు రాజ్యమేలినంతకాలమును రామరాజు యెక్కయు నతని సోదరులయు చేతులలో జంత్రపు బొమ్మయై వారెట్లా డించిన నట్లాడుచుండెను. ఇతని కాలమున రాయ సామ్రాజ్యమునకంతటి వాస్తవమైన యొడయడు రామ రాజు; అతని సోదరులైన తిరుమలరాజు వెంకటాద్రులు

లతనిగుడి యెడమ భుజములవలె ప్రవర్తించుచు నతని కార్యనిర్వహణములకు గర్తలై యుండిరి. వీరితోపాటు వీరి దాయాదులైన నందియాలవారును నవుకువారును వీరికి ప్రాపుగ నిల్చి వీరి ప్రభుత్వము నిర్విఘ్నముగ గొనసాగునట్లు చేసిరి. సామ్రాజ్యమునం దెల్లయెడల వీరి ప్రభావము హెచ్చినది. సదాశివరాయల రాజ్యాభిషేకముతో నారవీటిరాయల యుగము ప్రారంభమాయెనని చెప్పనగును.

సదాశివరాయల రాజ్యకాలమును మూడు భాగములుగ విభజింపవచ్చును. మొదటి భాగము శ. 1456 నుండి 1473 వఱకు 18 సంవత్సరముల పర్యంతము సాగినది. ప్రథమ దశయందు రామరాజు తాను రాయల సేనాధ్యక్షుడై యతనికి రాజ్యపరిపాలనమందు తోడ్పడుచుండినట్లు చెప్పుకొనెను. తరువాత ద్వితీయ దశయందు సర్వాధికారియై రాయ బిరుదులను వహించి శ. 147 మొదలు 1486 వఱకు 13 సంవత్సరముల సదాశివరాయలతోపాటు రాయలై ప్రభుత్వముజేసెను. శకము 1486 లో రాక్షసి తంగడి యుద్ధమున రామరాజు నిర్యాణమందిన పిమ్మట నతని తమ్ముడు తిరుమలరాజు తన యన్న పదవిని స్వీకరించి సదాశివరాయలపేర శ. 1492 వఱకు 6 యేండ్లకాలము సామ్రాజ్య పరిపాలనము నడపెను.

రామరాజు సామ్రాజ్యాధిపత్యము వహించిన పిమ్మట పరిపాలనయందు కొన్నిమార్పులు జేసెను. ప్రథమమున బేర్కొనదగినది బ్రాహ్మణుల నున్నత పదవులనుండి తొలగించుట. విజయనగర సామ్రాజ్య సంస్థాపన యైనప్పటినుండియు బ్రాహ్మణులు బహుళముగ ప్రధానులుగను దండనాయకులుగను రాజకీయోద్యోగులై సామ్రాజ్యమంతటను మిక్కిలి పలుకుబడి గల్గియుండిరి. కృష్ణదేవరాయలంతటి రాజ్యతంత్ర మర్మజ్ఞుడు రాజ్యమున కాయపట్టు స్థానములగు దుర్గపాలక పదవులందు బ్రాహ్మణులను దప్ప నన్యులను నియమింపరాదని శాసించియుండెను. కృష్ణరాయల మరణానంతరము రాజ్యము నాక్రమించుకొనుటకు రామరాజు పన్నిన పన్నుగడలను నెఱవేర నీయక వారడ్డుపడి భగ్నము గావించిరి. వారున్నత పదవులున్నంత కాలమును దన కోర్కె యీడేరదని గ్రహించి వారిని పదభ్రష్టులజేయ నిశ్చయించికొనెను. అచ్యుతరాయలతో సంధికుదిరి తత్ఫలముగ నతఁడు గృష్ణరాయల యర్భకపుత్రునికి బ్రతినిధిగ సామ్రాజ్యమున కతనితో సమాన భాగస్వామియైనప్పుడు బ్రాహ్మణోన్నతోద్యోగులను బెక్కండ్ర నుద్యోగములనుండి తొలగించి వారి స్థానమున దన బంధువులను మిత్రులను, ననుచరులను నియమించియుండెను. సదాశివరాయల రాజ్యాభిషేకానంతరము సామ్రాజ్యమున కంతటికిని తానే సర్వాధికారి యగుటచేత బ్రాహ్మణులకు రాజకీయోద్యోగములందు తావులేకుండ జేసెను. సదాశివరాయల రాజ్యకాలమందంతటను గానవచ్చు బ్రాహ్మణోద్యోగి ప్రముఖులు మువ్వురే -- రామాభట్లయ్య యొక్కడు; రామయామాత్యుడు మఱియొక్కడు; మూడవవాఁడు పులగడ్డ పాపనరసయ్య. రామాభట్లయ్య మొట్టమొదట యచ్యుతరాయల క్రింద ప్రాముఖ్యమునకు వచ్చెను. కొంతకాలము రాయరాజ్యమున ప్రథమ దుర్గమని పేరొందిన ఉదయగిరికి దుర్గాధ్యక్షుడై యుండి యటు పిమ్మట శిరఃప్రధాని యాయెను; రామయామాత్యుడు గాంధర్వ విద్యావిశారదుడు; వాస్తుశాస్త్ర మర్మజ్ఞుడు; కొంతకాల మీతఁడు కొండవీటి దుర్గాధ్యక్షుడై యుండి బ్రాహ్మణుల కగ్రహారముల నొసఁగెను. రామరాజుయొక్క చిన్నతమ్ముడైన వెంకటాద్రి యాజ్ఞాపనములవలన నితడు స్వరమేళ కళానిధియను సంగీత శాస్త్ర గ్రంథమును రచించి రామరాజున కంకితము జేసెను. పై బేర్కొనిన వా రిరువురు సదాశివరాయల రాజ్యకాల ప్రారంభ దశయందే కానవచ్చుచున్నారు; తరువాత వీరి ప్రస్తాప మెందును గాన్పించదు. మూడవవాడైన పులిగడ్డ పాపనరసయ్య మహామేధావి; ఇతడు దౌత్యము నడపుటయందు చతురుడు. రామరాజు పక్షమున నితడు దఖనీ మహమ్మదీయ సంస్థానములందు స్థానాధిపతియై యుండెను. రామరాజు మరణానంతరముగూడ నితడు సజీవుడై యుండెనని కొన్ని యైతిహ్యములవలన దెలియుచున్నది — ఈ మువ్వురు దప్ప మఱి యెవ్వరును బ్రాహ్మణోద్యోగులు సదాశివుని కొలువున నుండిరనుట కాధారములు లేవు. కావున రామరాజు బ్రాహ్మణోద్యోగి వర్గము సూచముట్టుగ బెకలించివేసెనని చెప్పవలసి యున్నది.

రామరాజు చేసిన మార్పులలో మఱియొకటి రాయరాణువయందు మహమ్మదీయ సైనికులను జేర్చుకొనుట. ఇది కేవలము క్రొత్త మార్పని చెప్పరాదు— ఏలనగా రాయ సైన్యము మహమ్మదీయులను జేర్చు

కొను నాచారము మొదటి దేవరాయల నాడె ప్రారంభ మైనది. నాటినుండియు దురక లాశ్వికులుగను, విలు కాండ్రుగను పని గొనియుండిరి; కాని రామరాజు హయాము వఱకును రాయరాణువయందు మహమ్మదీయ భటుల సంఖ్య యల్పిష్టము; మఱియు సైన్యమున గీలక స్థానములందు వారిక ప్రవేశము లేదు; దేశ సంరక్షణ మర్మములు నిగూఢములై వారి కెఱుక పడక యుండినవి. రామరాజు స్వపక్షమును బల పఱచుకొనుటకొఱకు దురకలను బహు సంఖ్యాకులను ధారాళముగ సైన్యమున జేర్చుకొని వారి నాయకులకు గొప్ప యుద్యోగముల నిచ్చెను; మఱియు వారు నివసించుటకు రాజధానియందు ప్రత్యేకవసతుల నేర్పఱచి మసీదులను గట్టించి వారు తమ మతాచారములను యథేష్టముగ ననుసరించుట కనుమతించెను. ఇందువలన రాయసామ్రాజ్యమున దురక ప్రాబల్యమతిశయించినది. రామరాజిట్లు తురకల కాశ్రయమిచ్చి యభిమానము జూపినను వారు స్థిరముగ నతనికి గృతజ్ఞతాబద్ధులై యుండలేదు; తలగోక జేనెత్తికొనిన కొఱవులవలె దురకాతని వినాశమునకు గారణభూతులైరి.

రామరాజు మహమ్మదీయ రాజ్యములయెడ బూర్వ విజయనగర భూపాలుర మార్గము నవలంబింపక క్రొత్త దారిద్రొక్కెను. రాయసంస్థాన స్థాపన కాలమునుండియు విజయనగర రాయలకు భారతీయ మహమ్మదీయ రాజ్యములతో సంబంధముగలదు. రాయ భూపాలురు నిజ స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుట కొఱకు మొదట ఢిల్లీ పాదుశాహుతోడను నటుపిమ్మట గుల్బర్గ బీదరు సుల్తానులతోడను దఱుచుగ బోరాడ వలసియుండెను. ఈ యుద్ధములం దేపక్షమువారైనను బరాజితులైనపుడు ప్రతిపక్షులతో సమాధానము గుదుర్చుకొనువారు. కాని సంధియైనను విగ్రహమైనను వారి కెల్లపుడును బరస్పరము ద్వేషమే కాని మైత్రి యెన్నడును సమకూడలేదు.

మఱియు రాయ రాజ్యాధిపతులు తురక రాజ్యముల రాజకీయ వ్యవహారములలో నెప్పుడును చొరవ గలిగి చుకొనువారు కారు. తురకలు తమపై దండెత్తి వచ్చినప్పుడు వారి నెదిర్చి పోరాడి తఱుమగొట్టుచుండెరే కాని సర్వసాధారణముగ దురకరాజ్యముపై దండెత్తి పోవువారు గారు. రామరాజు తురక రాజ్యముల రాజకీయమున ప్రవేశము గల్పించుకొని వారితో జెలిమి వాటించి పరస్పరము వారొండొరులతో జేయు యుద్ధములలో బాల్గొనువాడు. ఆధునిక చరిత్రకారులు కొందఱు రామరాజు దక్కనీ సుల్తానుల కొండొరులకు గలహములు పెట్టి వారిలో నొకరి పక్షము నవలంబించి మఱియొకరి నోడించుచు దన్మూలమున ప్రాబల్యము నందెననియు దురకు వారీ రహస్యమును గ్రహించి యేకమై యాతని నోడించి చంపిరనియు జెప్పుదురు. ఫెరిష్టా మొదలైన మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలను బరిశీలించి చూడగా దక్కనీ సుల్తానులకు బరస్పర వైషమ్యము రామరాజు మూలమున గల్గెనని చెప్పుటకు దగిన యాధార మెద్దియు గన్పించదు. వారికి పరస్పర వైషమ్యము స్వభావ సిద్ధమైనదే. దక్కనీ మహమ్మదీయ ప్రభువుల కైకమత్యము లేదనియు వారు సర్వదా సారమేయములవలె నొండొరులతో కాట్లాడుచుందురనియు సమకాలిక పోర్చుగీసు చరిత్రకారుడైన న్యూనిజు వ్రాసియున్నాడు. రామరాజు తురకలకు దగువులు పెట్టకపోయినను వారితో గొందఱి పక్ష మవలంబించి మఱికొందఱిపై యుద్ధములు జేసినది వాస్తవమే; కాని తన సహాయ మర్థించి ప్రార్థించినది యతడెన్నడును నెవ్వరికిని ప్రాపై యుద్ధమునకు నడువలేదు. యుద్ధములందు సర్వసామాన్యముగ జయమే చేకూరుచువచ్చినది; అందు వలన నతని బల మతిశయించి దక్కను మహమ్మదీయ ప్రభువుల కధినేతయైనది వాస్తవమే. ఆతని యాధిక్యత సైపనోపక తురకరాజు లతని నోడించినదియు వాస్తవమే. తరువాతి ప్రకరణమున నీ విషయమును విపులముగ వివరింతును.

(సశేషము)

---

# కొండల్ని నీలంగా మార్చేది దూరమే!

శ్రీ సోమసుందర్

ఆ కనిపించే కొండల్ని
అంత నీలంగా మార్చింది దూరమే;
ఆ దూరాన్ని కాలంతో జయిస్తే
ఏముంది?—రాళ్ళూ రప్పలూ
తుప్పలూ ముళ్ళూ తప్ప!

ఆ కొండల సరిహద్దుల కావల
ఏమీ లేదన్నది భ్రమ...
గ్రామాలూ ఆరామాలూ కామనలూ
మానవులూ మమతలూ ప్రేమలూ
మృగాలూ ఈర్ష్యలూ ద్వేషాలూ
ఉన్నాయని నిశ్శంకగా నిశ్చయించేది
వాస్తవికత...

ఈ అచలాలు నా దృగంచలాలకి
అకుంఠిత అవగుంఠనాలై వ్రేలగా
వాటి వెనుక సర్వశూన్యమన్న భ్రమ
ఎంత మధురం!
ఎంత ఆకర్షవంతం!...ఎంత వాంఛనీయం!
రజ్జువును సర్ప మనుకొనే భ్రాంతి
భయోత్పాదకమై కంపింప చేస్తుంది
శరీరాల్ని...హృదయాల్ని.. సర్వస్వాల్ని...
గాజుముక్కపై సూర్యరశ్మి పడితే చాలు—.
తళతళ మెరిపించి వజ్రమనిపించే భ్రాంతి
క్షణంలో నగమై తేనేం? అలరిస్తుంది
నయనాల్ని...

ఇంత దూరాన్నీ కుంచించి
ఇంత వైశాల్యాన్నీ హ్రస్వీకరించి
భయానక భ్రమల్ని కల్పించే
చీకటిని చూస్తే నా కందుకే అంత అసహ్యం!

వెలుతురు కల్పించేవి భ్రమలా?
ఆశావహ మనోహర దిక్ప్రభవులు కాని!!

నువ్వు చేసే మంచి చెడ్డలకు
ఇక్కడే సద్యఃఫలిత మనుభవించి
నిష్పూచీగా కన్నులు మూస్తావన్నది—
వాస్తవికత!
మృత్యువు తర్వాత లభిస్తాయనుకొనే
స్వర్గసౌఖ్యాల భ్రమలు, అచంచల
ఆశాదీప్తి నిచ్చి
చివరిసారిగా కన్ను మూస్తే సంభవించే
కటికచీకటిదారుల భయాలలో
వెదజల్లుతాయి స్నేహ కిరణాల్ని!

కనుకనే వినీలంగా కనిపించే కొండలంటే—
ఆర్ద్రంగా మసృణంగా కనిపించే కొండలంటే—
దిగ్భిత్తికల నీడల్లో ప్రడమి చెక్కిళ్లను
మార్దవంగా స్పృశించే క్షితిజ రేఖలంటే—
విరహపు సెగల్లో చల్లగా సేద తీర్చే
స్మృతులంటే—
నీలినీలి దారాలతో దూరాలను కుట్టేసే
భ్రమలంటే—
నా కెంతో ప్రేమ!
నీలికొండ తలపాగాలో
నెలవంక తురాయిని దర్శించడం
నాకెంతో అప్యాయన!

# సంశోధిత మహాభారతము -
# కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు

## కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావు

(గత సంచిక తరువాయి)

భారతమున తిక్కన పద్యములకంటె ఈ పద్యమునం గూర్చిన లోకోక్తులు రెండు వ్యాప్తిలో నున్నవి.

కర్ణుడులేని భారతమూ - శల్య సారథ్యము

తిక్కన విరాట పర్వమున—తన భారతమును 'ప్రబంధమండలి'గా పేర్కొన్నాడు. అనగా ఒక్కొక్క పర్వ మొక్కొక్క ప్రబంధముగా దిద్దితీర్చినాడని యర్థము. ఈ కర్ణపర్వ ప్రాధాన్యమును గుర్తించి, తిక్కన, దీనికి ఫలశ్రుతిచెప్పి—దినిని ప్రబంధమని వ్యక్తపఱచినాడు.

చ. అనలుఁడు భాస్కరుండును
సుధాంశుఁడు నధ్వర సంప్రవర్తకుల్
వినుము నరేంద్ర రాజ క్రతుపు
విష్ణుమయంబని నిర్వహించిర
ర్జునుఁడును గర్ణుఁడున్
సమర దీక్షునందగ నీ ప్రబంధమిం
పొసరఁ బఠించి వినిన
నొందునరుండె జిర సౌఖ్య సంపదల్
(3—397)

శల్య పర్వము

మహాభారతమున నవమ పర్వము శల్యపర్వము.

ఆ. సకల విస్తరిల్లి శల్యాదికములైన
నాల్గు పర్వముల వినంగఁ జాలి
నవమ పర్వమునఁగ నవ్వార్థ రమణీయ
మగుచు శల్యపర్వమతిశయిల్లు
ఆది. 1–52.

నన్నయ ఇందు మూలమున 'మూడువేల నిన్నూట యిరువది శ్లోకంబులు' లని చెప్పినాడు. ఈ 3220 శ్లోకములకు తిక్కన రచన:

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసము | 405 | గద్యపద్యములు |
| ద్వితీయాశ్వాసము | 423 | ,, |
| | 828 | |

ఈ పర్వమున నాల్గవవంతు మాత్రమే అనువదింపబడినట్లు కన్పట్టుచున్నను—పర్వకథా భాగమంతయు పూర్తిగా గ్రహింపబడినది.

సౌప్తిక పర్వము

మహాభారతమున పదవ పర్వము

క. నుతసౌప్తికాది పర్వ
త్రితయంబునఁ దనరి వసుమతీ సురవరస
మ్మతమై సౌప్తిక పర్వము
ప్రతిథ నినంబొలుచు దశమ పర్వంబగుచున్
ఆది 1–54.

సౌప్తికపర్వము దశమ పర్వము గావుననే—భారతము—పర్వసంఖ్యనుబట్టి కథా క్రమమునుబట్టి నాలుగు భాగములుగా విభజింపబడినది.

ఆదిపంచకము—1. ఆది 2. సభా 3. ఆరణ్య 4. విరాట 5. ఉద్యోగ పర్వములు.

యుద్ధ పంచకము—1. భీష్మ 2. ద్రోణ 3. కర్ణ 4. శల్య 5. సౌప్తిక పర్వములు.

శాంతిత్రయము[1]— 1. స్త్రీ 2. శాంతి 3. అనుశాసనిక పర్వములు.

1. శాంతిత్రయమునకు—శ్రీమాన్ నేలటూరి పార్థసారథి అయ్యంగారు 'ఆమ్నాయకళానిధి' అను వ్యాఖ్య రచియించియున్నారు— ఇవి నా జనకులు సంపాదించిన ముద్రిత పుస్తకభాండాగారమునుండి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధక సంస్థవారు సంగ్రహించిరి. ఇవి నేడు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున మా తండ్రిగారి ముద్రతో నున్నవి.

అంత్యపంచకము— 1. అశ్వమేధ 2. ఆశ్రమవాస
3. మౌసల 4. మహాప్రస్థానిక
5. స్వర్గారోహణ పర్వములు.

ఈ సౌప్తికపర్వమున నన్నయ 'రెండువేల నెనమన్నూట డెబ్బది శ్లోకంబులు గల'వని వ్రాసి యున్నాడు— కాని 2870 శ్లోకముల మూలమునకు తిక్కన రచనలో 376 గద్యపద్యములు కన్పట్టు చున్నవి.

ప్రథమాశ్వాసము 240 గద్యపద్యములు
ద్వితీయాశ్వాసము 136 ,,
376

మూలానువాదముల కింత వ్యత్యాస మెన్నడు నుండదు. పరిశీలింపగా— దీనికి పాఠభేదమున్నది. ఒక తాళపత్ర ప్రతిలో 'ఎనమన్నూట డెబ్బది శ్లోకములు' అని కలదు— నేటి సంస్కృతమూలమునకు 870 శ్లోకములే యుండుటచేత — నీ సంఖ్య నిశ్చితమని తిక్కన, మూలమున నర్ధభాగము మాత్రమే తెలుగుచేసినాడని గ్రహింపవలెను—

## స్త్రీ ప ర్వ ము

ఇది మహాభారతమున పదునొకొండవ పర్వము.

క. పర్వుచు స్త్రీ పర్వాదిక
పర్వంబుల నేనిటం గృపాయుతమై స్త్రీ
పర్వంబు పదునొకొండగు
పర్వమునా వెలయును కవిపండిత సభలన్. 56

నన్నయ ఇందు— 'వేయునేడునూట డెబ్బదియైదు శ్లోకంబులు గల'వని చెప్పినాడు— ఇచ్చటను మూలానువాదములకు విశేష వ్యత్యాసముగలదు.

ప్రథమాశ్వాసము 189 గద్యపద్యములు
ద్వితీయాశ్వాసము 187 ,,
376

1775 శ్లోకములకు 376 గద్యపద్యము లున్నచో— ఎంతో కథాభాగము విడిచిపెట్టబడి యుండవలెను. కాని, తిక్కన స్త్రీపర్వమును మాత్రము తనకు లభించిన సంస్కృత తాళపత్ర మాతృక ననుసరించి సరిగా రచించినాడు.

నన్నయ భారతమున సంస్కృత శత పర్వాను క్రమణిక ననుసరించి—

ధర్మజ రాజ్యాభిషేకము
చార్వాక నిగ్రహము
గృహప్రవిభాగము

అను మూడు వృత్తాంతములును స్త్రీ పర్వములోనే చెప్పి 1775 శ్లోకము లన్నాడు. కాని పై మూడు శీర్షికలు, శాంతిపర్వమున నాది భాగములుగా నున్నవి— నేటి స్త్రీ పర్వము సంస్కృత మూలమున 775 శ్లోకములే యుండుటవలన - తిక్కన సౌప్తిక పర్వము నందువలె, నిందును, నర్ధభాగము మాత్రమే గ్రహించి నాడని చెప్పవలెను.[2]

## అనువాద విధానము

తిక్కన మూలము నెట్లనువదించినదియు యుదాహరణములు చూపుచున్నాను.

1. 'కదాచిద్విజ యస్యాహ మస్త్రతోరట నన్నప
అజ్ఞానాద్ధిక్షిపన్ బాణాన్ ఘోరరూపాన్
భయానకాన్
హోమధేన్వావత్సమస్య ప్రమత్త ఇషుణా హనట్
45. అ. 39—40 శ్లో.

సీ. శ్రమమునకై యేను సకలాంబకములు నె
క్కుడు వెసనేయ నయ్యెడమే నొక్క
యాఁబెయ్యయుడికి నా యజ్ఞానమున నంప
తాఁకున గూలుఁడు. దాని గుబుగు.

ఇది యథా మూలము.

2. 'అన్యదస్మై వరం దద్యామే
కుంజరాణాం శతానిషట్
కాంచనైర్విధైర్యాండైరాచ్ఛన్నాన్
హేమ మాలినః
ఉత్పన్నాన్నాం పరాంతేషు
వినీతాన్ హస్తి శిక్షకైః
నచేత్త దభిమన్యేత
పురుషోర్జున దక్శివాన్.'
40. అ. 14—15 శ్లో.

---

2. సంశోధిత మహాభారతము — ఆదిసభాపర్వములు పుట 235.

సీ. వలను శోభిల్ల నెవ్వాఁడైన వీఁడె య
ర్జునుఁడని నా కిపుడు సూపెనేని
బసదనం బే నిచ్చు భంగి యందఱకును
వివరించి చెప్పెద వినుఁడు వీఁటు
వొగడంగ దగు రథ్యముల తోడి సౌవర్ణ
రథములు వలసిన రయము లావు
బొలుపును గలుగు కాంభోజ హయంబుల
వలసినఁ బేర్చు సత్త్వంబునందుఁ
గీ. బరిణతములగు సుందరకరివరములు
వలసినను జారు లావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కె
కెక్కుడమ్మేటి మగనికే నిచ్చువాఁడ.
(2—30)

తిక్కన మూలమున్న పెంచినాడు—'హస్తి శిక్షకైః' అనుదానికి, పుట యడుగుననున్న, పెక్కు శ్రవంబులందు—అని తిక్కన యనువదించినాడు. అనగా ఏనుగులు యుద్ధరంగమున పనిచేయుటకు తగిన పరిశ్రమతో సిద్ధము చేయబడినవి అని యర్థము—ఇంతేకాక—'రయమును లావు బొలుపును గలుగు కాంభోజ హయంబులు' అను విశేషణములు కూడ—అమూలకములే—చారు లావణ్యసుతులు — మహాగ్రామములు—అనునవి మూలమున లేవు.

కర్ణుడు దాతృత్వమునకు మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవాడు కావున తిక్కన—ఆ విషయమును వ్యక్త పఱచుట కీ పద్యమున—మూలములోని విశేషములను దెలిపినాడు.

తిక్కన భారతమును, మూలముతో పోల్చుచు నింతవఱకు పూర్తి పరిశోధన జరుగలేదు. ఈ పరిశోధనలో ప్రథమ గ్రంథము ఆంధ్రభారత కవితా విమర్శనము.[4]

స్త్రీ పర్వము—ఛందస్సు

మహాభారతమున తిక్కన రచనలో వృత్త వైవిధ్యమున్నది. స్త్రీ పర్వము మాత్రమే కేవలము శోకమయమగు నీ పర్వమున, వృత్త వైవిధ్యముండుటకు హేతువులను లోతుగా నన్వేషించి శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు చర్చించుటయేగాక తిక్కన ఈ పర్వమున వాడిన విశేష వృత్తముల పట్టిక—గణ విభజనతోసహా యిచ్చి యున్నారు—వృత్తముల ఆశ్వాస పద్య సంఖ్య గలదు.

అది 'స్త్రీపర్వము—విశేషవృత్తము' అని పేరు గలిగియున్నను— అందీయబడిన వృత్తములన్నియు విశేషములు కావు.

చూడుడి దలి వృత్తములు:

| | |
|---|---|
| అంబురుహము | భుజంగప్రయాతము |
| ఇంద్రవజ్ర | మంగళమహాశ్రీ[6] |
| ఉత్సాహ | మంజుభాషిణి |
| ఉపజాతి | మందాక్రాంతము |
| ఉపేంద్ర వజ్రము | మణిగణ నికరము |
| కవిరాజ విరాజితము | మణిమాల |
| క్రౌంచపదము | మత్తకోకిల |
| జలదము | మానిని |
| తరలము | మాలిని |
| తరువోజ | మేదిని |
| తోటకము | లయగ్రాహి |
| తోదకము | లయవిభాతి |
| దోదకము | వనమయూరము |
| ద్రుతవిలంబిత | వసంతతిలక |
| నర్కుటము | శిఖరిణి |
| పణవము | శుద్ధవిరాటి |
| ప్రహరణకలిత | సరసిజము |
| బంధురము | స్రగ్విణి |
| భాస్కరవిలసితము | స్వాగతము— |

ఈ వృత్తములన్నింటికి గణములు పేర్కొనబడినవి కాని, రెండు పట్టులలేవు—

1. ప్రహరణకవిత... (1–185) ఇది 14 వదియగు శక్వరీ ఛందస్సున బుట్టినది—

న, న, భ, న, వ— గణములు.

---

3. పుట యడుగున—2. బెక్కు శ్రవంబులందు—పెక్కు జవంబులందు అను పాఠములు గలవు. వీనిలో శ్రవంబులందు—అను పాఠమే సమంజసము.

4. గ్రంథకర్త — కీ. శే. కోరాడ రామకృష్ణయ్య.

5. ఉపోద్ఘాతము 44–48 పుటలు.

6. మంగణమహాశ్రీ అచ్చు సరికాదు. 'మంగళ' అని యుండవలెను.

2. లయవిభాతి..................1—131
........................... 2 – 73

న, స, న, న, స, న, స స, న, న, స గ

ఈ క్రింది వృత్తమునకిచ్చిన గణములు సరి కావు—

మణిమాల త, య, త, య 1—108

కాని, 1—108 చూడుడు—

మణిమాలా వృత్తము—

భవదీయ సూనులరి సైన్య పంక్తిఁ గొని
కాల్చిరెల్ల భోగడన్
వివిధాస్త్ర శస్త్రమయ సాంద్రవృష్టిఁ
దెగటారి పెంపు మిగులన్
దివికేగియందు మహనీయ తేజ
మెసగంగ హృద్యబలభిత్
ధ్రువ సౌఖ్యసంపదలు గాంచి సంతోషమునఁ
దేలిరేల వగవన్.

మణిమాల ఇరువదియొకటవ ఛందమగు ప్రకృతి నుండి పుట్టినది.

స, జ, స, జ, స, జ, స—

అజహత్పయోధి ఘృతంబు లమ్మచు
మురారిఁబాడి రెలమిన్.

అప్పకవీయము 4. ఆ.

1—64. ఉపజాతి వృత్తము.

పట్టికలో (46 పుట) ఉపజాతి వృత్తమునకీ క్రింది గణము లీయబడినవి.

ఉపజాతి. సరిపాద—జ, త, జ, గ, గ

బేసి త, త, జ, గ, గ

కాని 1—64. ఉపజాతి వృత్తమున గణములు సరిపాదమున సరిగ లేవు.

మునీంద్ర నిర్భాగ్యత ముట్టి చావుం
గానేర దయ్యెంగడుగట్టి చిత్త
బనూన మూర్ఛం.

రెండవ పాదమున 'చిత్తట' అని యుండవలెను. లేనిచో గణభంగము.

పై ముప్పదియెనిమిది వృత్తములును, విశేష వృత్తములని, అవి తిక్కనయే యుపయోగించెనని చెప్పటకు వలనుపడదు. తిక్కనకంటె పూర్వులగు నన్నయ, నన్నెచోడ కవులు-వీనిలో కొన్నింటిని ప్రయోగించియే యున్నారు.

నన్నయ— 1) అంబురుహము 2) ఉత్సాహ 3) కవిరాజ విరాజితము 4) తరల 5) తరువోజ 6) తోటకము 7) ద్రుతవిలంబిత 8) మత్తకోకిల 9) మానిని 10) మాలిని 11) వనమయూరము 12) వసంతతిలక 13) స్వాగతము.

నన్నెచోడకవి— 1) క్రౌంచపదము 2) మంగళమహాశ్రీ 3) మణిగణనికరము 4) లయవిభాతి.

తిక్కనకు పూర్వు లుపయోగించిన 17 వృత్తములు పోగా నాతడు 21 విశేషవృత్తములు వాడెనని మనము చెప్పవచ్చును.7

తిక్కన ఛందస్సుగూర్చి చెప్పునపుడు సంపాదకులు స్రగ్ధర, మహాస్రగ్ధలనుగూర్చి ప్రస్తావింపకపోవుట వింతగా నున్నది. సౌప్తికపర్వమున రెండాశ్వాసముల లోను— 10 స్రగ్ధరలను— 10 మహాస్రగ్ధరలను— మొత్తము 20 వాడినాడు.

స్త్రీ పర్వాశ్వాసాంతముల వృత్తాలు చితి

తిక్కన స్త్రీపర్వము ప్రథమాశ్వాసాంతమున శిఖరిణీ వృత్తము వాడినాడు.

తపస్స్వాధ్యాయాది క్షపితమల చిత్త ప్రకలితా
విపజ్జ్వాలాజ్వాలా విరమణసుధా వృష్టి లలితా
జపాపుష్పక్షీరచ్ఛవి కిరణ సంసర్జన ధురా
సపర్యానిర్వాహ ప్రచురకలన స్థైర్య మధురా.

1–187

ద్వితీయాశ్వాసాంతమున మందాక్రాంత వృత్తము వాడినాడు.

వీణావాద ప్రతిమనిగమా విర్భవత్సార పుణ్య
శ్రేణీ సంపాదిత విమలతాస్తోమ నిర్లేప చిత్త

---

7. అద్యతనకాలమున మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు, తమ 'బిల్వేశ్వరీయమున' తిక్కనకన్న హెచ్చుగా ననేక విశేష వృత్తములు వాడినారు. రత్నావళి, వెండి, బంగారము మున్నగు నూతన వృత్తములను సృష్టించినారు. నేడాంధ్రఛ్ఛందస్సులనుగూర్చి పరిశ్రమచేయువారందరును నీ గ్రంథము విస్మరించిరి.

త్రాణ క్రీడాకలన సతతోత్సాహవ ద్దివ్యభావా
ప్రాణాపానాహరణ నిపుణ ప్రాపణీయానుభావా.
2—185

శిఖరిణి— మందాక్రాంత— రెండును 17 వది యగు అత్యష్టి ఛ్ఛందస్సునుండి పుట్టినవి.

శిఖరిణి. య. మ. న. స. భ. వ—గణములు గలది. మందాక్రాంత. మ. భ. న. త. త. గ. గ.

ఈ రెండింటి నడకలలో తగ్గు, హెచ్చుట స్పష్టము.

స్త్రీ పర్వమంతయు, శోకభారమయము కావున తిక్కన, ఆ శోకభారము హెచ్చు తగ్గులను నిరూపించుచు తొలుత—తగ్గు నడకగల శిఖరిణీ వృత్తమును రచించి తర్వాత హెచ్చునడకగల మందాక్రాంత వృత్తము రచించినాడు. ఆ నాడు కాళిదాస మహాకవి విరహ భారమున యక్షుడు, సందేశము పంపినపుడు—మేఘ సందేశమున మందాక్రాంత వృత్తము నుపయోగించి నట్లుగా తిక్కన స్త్రీ పర్వమున—ద్వితీయాశ్వాసము మందాక్రాంత వృత్తముతో ముగించి స్త్రీ శోక భారము వ్యక్తీకరించినాడు. ఈ దృష్టితోగూడ నీ పర్వమును చర్చించుట యావశ్యకము.

### కవి వాగ్బంధనము

తిక్కన, కవివాగ్బంధనమను ఛందశ్శాస్త్రము రచించెనని యా గ్రంథాంత పద్యమువలన దెలియు చున్నది.

క. తనరంగ గవివాగ్బంధన
మనుఛందంబవని వెలయ హర్షముతోఁది
క్కన సోమయాజి చెప్పెను
జను లెల్లనుతింప శాస్త్ర సమ్మతిగాగన్

ఇది తంజావూరి పుస్తకశాలలో నున్నది[8] దీనిని పరిశీలింపవలెను.

### తిక్కన ఛందస్సు

ఆంధ్రఛ్ఛందశ్శాస్త్రమున—యతిప్రాస, వృత్త పరిణామము చరిత్రలో నన్నయది ప్రథమ ఘట్టము. తిక్కనది ద్వితీయ ఘట్టము. తిక్కన ఛందస్సును గూర్చి పర్యాప్తమైన పరిశీలన జరిగిన యెడల, ఆంధ్రఛ్ఛందో వికాసమునకది యెంతయేని దోహదము నొనరించును. తిక్కన కవి బ్రహ్మత్వము సార్థక మగును.

### కవితా విమర్శనము

ఈ సంపుటమున నా యా పర్వములలో తిక్కన ప్రదర్శించిన కవితా విశేషములుగాని—అనుసరణలుగాని తెలుపబడలేదు. వానిలో కొన్నిటిని మాత్రము దిక్ప్రద ర్శనముగా చూపుచున్నాను.

### కర్ణ పర్వము

ఇందు తిక్కన నన్నెచోడకవి ననుసరించిన పట్టులున్నవి. నన్నెచోడకవి తారకాసుర యుద్ధమును వర్ణించునపుడు సంస్కృత భారతమందలి భావము లను గ్రహించి-తన గ్రంథమున నెలకొల్పినాడు[9]—ఇవి కుమారసంభవ సంస్కృత మూలమున లేవు. తిక్కన కుమారసంభవానుకరణములు ద్రోణపర్వమున స్త్రీ పర్వమున గూడ నున్నవి. కాని యిచట కర్ణ స్త్రీ పర్వాను సరణములనే యిచ్చుచున్నాను.

నన్నెచోడుడు

1) క. కరములఁ ద్రెవ్వఁ బండుల
కరాసి గఱచికొని రౌద్రగతినని మేషో
త్కరమున దెగఁబఱచె నొక్కఁడు
సురవాహిని దఱియుకొమ్ము చోఁఱయుఁ బోలెన్
11-160.

2) క. ఆతతముగ శక్తుఁడుద
త్స్వాతిగతుండై వ గురియు సంతత ధారా
పాతమును బోలె దనుజ
వ్రాతముపై గుహుఁడు బాణవర్షము గురిసెన్
12-136.

### కర్ణ పర్వము

తిక్కన—

ఆ. వె. వానినెల్లఁ ద్రుంచి వలవ్రచ్చికొని లీల
నిగుడుచోఁఅవోలె వెగడు పడక
తఱిమి రక్తనదుల వఱపె మస్తక కూర్మ
హస్త భుజగతతుల నతిశయిల్ల
3-158.

---

8. A descriptive Catalougue of Telugu Manuscript Tanjore S. S. M Libary No 703.

9. కుమారసంభవము—సుపరిష్కృతప్రతి — అముద్రితము.

క. స్వాతిగతుండయి శుక్రుం
డేతేరఁగఁ బరగఁజేయు నెంకపు వర్షం
బాతెఱఁగున సాయక వ
ర్షాతిశయం బావహించె నతఁడు నరేంద్రా
3–42.

ఇచట—పద్యము—ప్రాస—రెండు సమానములే.

నన్నెచోడకవి :

1) ఉ. ఆడెడి రూపులుం గలయ నాడెడి
గ్రద్దలుఁ జప్పరించి పో
రాడు పిశాచముల్ నెగసియాడెడు
నట్టలు వాని జిఱ్ఱు ము
ఱ్ఱాడెడు భూతసంకులము
నంగద నిల్వక చుట్టుముట్టుగా
నాడెడు జంబుకాళిఁ గలహోవని
భీకరమయ్యెఁ జూడఁగాన్. 11–192

చ. కడితలకాఱు వ్రేయఁ గడికండ
ములై పడివండదర్గిన
ట్లడగొనియుండె ముత్తునియ
లై పడ నల్గడలందుఁ గలిఁగో
ల్మోడిచిన యట్లుయుండె
నడుముల్ దిగిపోయిన జన్నిదంబొగిన్
బొడిచినయట్లు యుండురణ
భూమి కృతాంతకు బానసంబౌనాన్.
11–192

స్త్రీ ప ర్వ ము

తిక్కన :

సీ. ప్రేవులు గండలు పెఱికివే టాడి యం
గదగొని మెదడుల గర్చికొనుచు
రాగిలి రక్తంబు ద్రాగుచులోచన
గుళికల నొలిచి మ్రింగుచును గుండె
కాయలాదటమెయి గబళించును గ్రొవ్వు
దెమలిచి నమలుచును ముకయూట
చవిగొని యానుచుజావక
యున్నరూపులు నచ్చుటకుఁ గాఁగఁ
బెలుచటన్ని

గీ. కొనిన వెఱబాయ బాఱుచుఁ జెనకి తొడరి [illegible]
కాటులాడుమనున్న కాకములు స్వగాలములును
రావులుగులును గ్రద్దలునుప్వ
కంబలును మానసము వికలమ్ము సేయి. 2—9

నన్నెచోడకవి— 'కృతాంతకు బానసంబౌనాన్' అను దానిని తిక్కన నిర్వచనోత్తర రామాయణమున నిట్లనుసరించినాడు.

సీ. పా. అవయవభేదంబుల మఱక తునియలై
యున్నగాత్రంబు లొక్కొక్కచోటఁ.

గీ. గమలషండంబు .... ......
.........గల్పాంతమున జముబానసంబు
నింటిలోపలఁబోలె నొప్పెసగి. (4–61)

నన్నెచోడకవి :

అది నానాథు పద ద్వయంబది
మదియాధీశు బాహుద్వయం
బదినాతేని కటి ప్రదేశమని
తారంతంత నొక్కొక్కెడన్
గదనాగ్రంబున నేఱితెచ్చి
పొడపుల్ నాఁ జూతు
రోలిన్ సతుల్ 11–186

స్త్రీ పర్వము

తిక్కన :

సీ. పా. తునియలు పెక్కైన పనిపడి గూర్చి రూ
పులు గనుంగొని మూర్ఛ మునుఁగువారు
2—22.

ఇచట యుద్ధరంగమున స్త్రీలు, తమ పతుల యవ యవములు చెల్లా చెదరై పడి యుండగా వానిని గుర్తించి, ఏరి, పతి ఆకారముగా చేయుట— అను భావము సంస్కృత మూలమున లేదని విమర్శకాభిప్రాయము.[10]

ఇతర కవ్యనుసరణములు

కర్ణ శల్యపర్వములలో శ్రీనాథుడనుసరించిన పట్టులు రెండు గలవు. వానిని దెలుపుచున్నాను.

క ర్ణ ప ర్వ ము

తిక్కన :

సీ. పా. కంబు చేనున్నది గాండీ
తమన తాటియంత
విల్లు (3 61)

10. కుమార సంభవ విమర్శనము కీ. శే శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

శ్రీనాథుడు :

గీ. తాటి యంతవిల్లు
ధరియించినాఁడవు

(హర. 7–23)

శల్యపర్వము (తిక్కన)

సీ. కుంజర నికురంబ కుంభ
స్థలీ సంగ
సిందూర రచులతోఁ జెలిమిఁజేసి
కేతన వ్రాత సంకీలిత మాణిక్య
రశ్ములగెడ విహారంబు సలిపి

తిక్కన :

సైనిక నికర వక్షస్థల పరిలిప్త
కాశ్మీర దీప్తులఁ గౌఁగిలించి
దండనాథోత్కర చండభావోద్వృత్త
చకు పభలు దారు సరసమాడి

తే. యంశు జాలంబులు భయస్పైన్యంబులందుఁ
బరఁగి బహువిధ శస్త్రాస్త్ర కిరణ తతులఁ
బెంసి పరభాగలక్ష్మి దీపించి మెఱయు
బాల్య రవణీయుఁడగు చిత్రభాను డొప్పె.

1–116.

శ్రీనాథుడు :

సీ. గగన కల్లోలి నీ కల్లోల మాలికా
హల్లీసకములతో నవఘళించి
చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా
స్తబక పంక్తులతోడ సరసమాడి
శరదాగమా రంభ సంపూర్ణ పూర్ణిమా
విమల చంద్రికలతో వియ్యమంది
బసరుహాసన వధూపృథ పయోధర భార
హార వల్లరులతో నవఁగి పెనఁగి

గీ. వేఁయు నెవ్వని యభిరామ విమలకీర్తి
యతఁడు చెలువొందు రాయ వేశ్యాభుజంగ
కదన గాండీవి జగ నొబ్బ గండ బిరుద
శాశ్వతుం డొప్పు సింగన సచివ వరుడు

నైష. 1–37.

శ్రీనాథుఁడేగాక కూచిమంచి తిమ్మకవియు నొక పట్టున తిక్కన ననుసరించినాడు.

తిక్కన :

చ. పటుతరమైన నారసముపొందు
నృపాత్మజుఁ డుగ్రుఁడై యుర
స్తటమునఁ బెట్టు గ్రుచ్చ్య బెడిదం
బయి వీపున నుచ్చిపోవ...

కర్ణ 2–220.

కూచిమంచి తిమ్మన—చాటువు.

చ. చతురులలోన నెంతయును
జాణవటంచు నిన్నుఁ గవుంగిలిం
చితి యిటు మాఱుమోపిడఁ గఁ
జెల్లునె? యోరసికాగ్రగణ్య

ఇది ప్రశ్న. దీనికి జవాబు—

..... అ
ద్భుత మయినట్టి బంగరపు బొంగరపుం
గవ బోలు నీకుచ
ద్వితయము ఱొమ్ము నాఁటి యల
వీపున దూసె నటంచుఁ

జూచితిన్—

అని ప్రత్యుత్తరము.

పర్వ విశేషములు—

శల్యపర్వము — హరిహరస్తుతి

మొదటి యుపోద్ఘాతమున శివ మాహాత్మ్యమును గూర్చి ప్రస్తావింపబడినది గాని యితర విశేషములు లేవు. తిక్కన హరిహర తత్త్వమును, స్తుతిని విరాటపర్వ ప్రారంభమునచేసి, ఆ వెనుక—ఆశ్వాసాద్యంత పద్యములయందే, హరిహరనాథస్తుతి చేసినాడని విమర్శకులు తెలుపుచున్నారు. కాని ఆ స్తుతి—ఆశ్వాసాద్యంత పద్యములయందే గాక పర్వ మధ్యమున కూడ నున్నది. శల్యపర్వములో—ధర్మరాజు శల్యునితో యుద్ధము చేయునపుడు విరథుడైనాడు—అప్పుడతడు—

క. 'గెలువుము శల్యుని నీవని
పలికి ముకుందుండు నన్నుఁ బనిచినవాఁడ
ప్పలుకులకు నసత్యత్వము
గలుగగ నేర్చునొకొ దైవఘటన బలమున్'

(1—263.)

'అని శంకించియుఁ, గొంకుపోవక నజ్జగన్నాథు వచనంబున కన్యథాత్వంబేల గలుగునని యద్దేవునిం దలంచి యా మాట యమోఘంబు గావలయునని ప్రార్థించి వెండియు. (1—264)

చ. స్ఫురిత షడర్ధనేత్రునిఁ ద్రిశూల
సముజ్జ్వలు నిర్గుణున్ గుణా

దర సముపాత్తమూర్తిం గలిత
ప్రభవస్థితి సంహృతి క్రియా
విరతి నెవరి త త్రిభువనీ
మహనీయుని దైత్యమర్దన
ప్పురుషవరుం జతుర్భుజు
విభుత్వ మహోన్నతు నాశ్రయించెదన్
(1—265.)

ఈ పద్యమునకు పుట యడుగున—పాఠభేదము ఉదాహరింపబడినవి : అందు నాల్గవ పాదమునకు—

.................................. స
త్పురుషుం జతుర్భుజున్ భుజగభూషు
మహోన్నతు నాశ్రయించెదన్—

అను పాఠమే సరియైనది — హరి చతుర్భుజుడు — హరుండు భుజగ భూషణుడు.

తిక్కన యిచట కృష్ణ స్తుతినే హరిహరనాథ స్తుతిగా పరిణమింప జేసియున్నాడు. హరిహరనాథ స్తుతియైనప్పుడు—మొదట హరికి, తరువాత హరునికి విశేషణము లుండవలెను. కాని యిచట మొదట హరుని గూర్చిన విశేషణము లున్నవి.

అశ్వాసాద్యంత పద్యములలో నంతటకు హరిని గూర్చిన విశేషణములతో ప్రారంభము. హరిహరనాథు నికి సమన్వయము గన్పట్టుచున్నది. పండితు లీ విష యము చర్చింతురు గాత.

హరిహరనాథస్తుతి - పాఠభేదములు

ఇంతవఱకు భారత పాఠములను గూర్చి చర్చించునపుడు ఆశ్వాసాద్యంత పద్యముల పాఠభేద ప్రసక్తి రాలేదు. కాని యీ సంశోధిత ముద్రణము వలన, వానిని కూడ మనము పరిశీలింపవలసినదిగా నేర్పడుచున్నది.[11] ఉదాహరణ కొక్కటి చూపుచున్నాను. శల్య. 2–420.

'శా. శ్రుతివాక్యార్థనయ ప్రభావముని సంస్తుత్యాను
భావా—శచీపతిముఖ్యానిమిషాభివాద్య.'

ఇచట అనిమిషాభివాద్య—అనుదానికి అనిమిషాభివంద్య— అను పాఠము చూపబడినది. 'శచీపతి ముఖ్యా నిమిషాభి వంద్య' అనునది సరియైన పాఠము. శచీపతియైన దేవేంద్రుడు—శివభక్తుడు — పరమ పాశుపతులలో నొకడు.

'దుర్వాస కశ్యప విరించి మృకండు పుత్ర
దేవేంద్రబాణ హరికృష్ణ దధీచిరామ
శ్రీవామదేవ కవి కుంభజ గౌతమాదీన్
పుణ్యానిమాన్ పరమపాశుపతాన్ స్మరామి.'
(చిన్మయదీక్ష.)

నైషధమున, దమయంతిపై విరాళిచే, దేవేం ద్రుడు తాను ప్రతినిత్యముచేయు శివపూజ మానినాడని చెప్పబడియున్నది.

ఉ. చిలుకలు కూయునో చెవులు చిందఱ
వోవఁగనంచు నెప్పుడున్
వెలు డదునందనోప వనిపిఖులకై;
యటుమౌళి భావ ని
ర్మల శశిరేఖసేయు నపరాధమునన్
గజదైత్య శాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు గోమలి!
నీదెస కూర్మియెట్టిదో. (4—24)

దీనినిబట్టి హరిహరనాథస్తుతి పద్యముల నెంత జాగ రూకతతో పరిశీలింపవలెనో విశదము కాగలదు.

తిక్కన హరిహరనాథస్తుతి పద్యములు ప్రత్యేకముగా నధ్యయనము చేయదగినవి. తిక్కన భారత మొక యెత్తు; అందలి హరిహరనాథ స్తుతి మఱియొకయెత్తు. భారత కథను లౌకికముగా దిద్ది చెప్పిన కవిబ్రహ్మ— హరిహరనాథ స్తుతి పరత్వమున ఆధ్యాత్మికామృతము ప్రసాదించి,

'అధ్యాత్మవిదులు వేదాంతమనియు' అని నన్నయ చెప్పిన వాక్యమును సార్థకము చేసియున్నాడు.

తిక్కన—హరిహరతత్త్వ ప్రతిపాదన

తిక్కన కాలమున శైవ వైష్ణవ మతముల స్పర్థలచే-కలహములు రేకెత్తుట కారణమున, నా

11. కీ. శే. శ్రీ శంభుప్రసాదుగారు రీ హరిహర నాథ స్తుతి ప్రాముఖ్యము నిప్పటికి పదునాల్గేండ్ల క్రిందటనే గుర్తించిరి. తిక్కన హరిహరస్తుతి పద్యము లన్నిటిని టీకాతాత్పర్యములతో ప్రకటించుటకు వారు సంకల్పించి ముద్రణప్రతిని తయారుచేయుటకు నా కాదేశించిరి. వారి యాదేశానుసారము, నేను తిక్కన భారతమునంతయు పరిశీలించి పై శల్యపర్వ పద్యముతో గూడ–ముద్రణప్రతిని వ్రాసియిచ్చితిని. కాని అన్నింటికి టీకాతాత్పర్యములు లభింపకపోవుటచే, ఆ పని విరమింప వలసి వచ్చినది. నేడీ సంశోధిత ముద్రణము— శ్రీ శంభుప్రసాదుగారు తలపెట్టిన కార్య సఫలీకరణ మునకు దోహదము నొసగుచున్నది.

రెండింటికి సామరస్యము కుదుర్చుటకు తిక్కన, హరిహరతత్త్వమును ప్రతిపాదించెననుట నిరాధారము; నిష్ప్రమాణము.

తిక్కనకు నూతేండ్లు ముందుగా, వీరశైవ ముగ ఆరాధ్య లేక వీరమాహేశ్వర సంప్రదాయము ప్రవర్తిల్లజేసిన మల్లికార్జున పండితారాధ్యుడు—వెలనాటి చోడుని సభలో—జైన బౌద్ధాది మతములతో పాటు హరిహర తత్త్వమును ఖండించి - శివపారమ్యమును శ్రుతిస్మృతి ప్రమాణములచే ప్రతిష్ఠాపించి యున్నాడు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర వాద ప్రకరణము —నీ హరిహర తత్త్వఖండనము గలదు.

తనకుముందే తెలుగు సాహిత్యమున నిది ఖండితమై యుండుటచే—తిక్కన తిరిగి సాహిత్యమునందే నీ హరిహర తత్త్వమును భారత మూలమున పునరుజ్జీవింప జేసెను. ఈ విషయ మీవలనే విపులముగా విశ్వతమైనది[12].

## స్త్రీ పర్వము

క. కురువంశ పెడల వచ్చిన
బరమోపాయమున మగుడ బడసెన్ మడసెన్
గురు నికరము తోడన యి
ప్పురుషుఁడు పురుషార్థ సారభాషణుఁడు గదే
2–112.

ఇది భీష్ముని గూర్చిన పలుకులు—ఈ పద్యమున 'పురుషార్థసార భాషణుడు' అన్నదానికి సంస్కృత మూలము లేదు. ఇందలి 'పురుషార్థసార' శబ్ద ప్రయోగముచే—నది 'పురుషార్థసారము' అను తెనుగు కృతిని ధ్వనింపజేయు చున్నదనియు, తిక్కన, ఆకృతిని, తత్కృతి కర్తయైన, శివదేవయ్యను నెఱిగియుండుటచే—తన గ్రంథమున దానిని సూచించినాడని నీవలను సాహిత్యలోకమునకు పరిచితమైన విషయము.[13]

పురుషార్థసారము తిక్కనకాలమునాటికి మిక్కిలి ప్రచారమున నుండెను. మడికి సింగన తన 'సకలనీతి సమ్మతము' అను సంకలన గ్రంథమున—పురుషార్థసారమునుండి—88 పద్యముల నుదాహరించినాడు.[14]

పురుషార్థసార కృతికర్త యగు శివదేవయ్యయే—గణపతిదేవ చక్రవర్తి కాలమునుండి—ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువఱకు కాకతీయ చక్రవర్తుల గురువై, మంత్రి శిఖామణియై వెలసిన, మహాపురుషుడు.

వనుమసిద్ధికి సహాయము చేయుటకై, గణపతిదేవ చక్రవర్తి నర్థించుటకు వెడలినప్పుడు—తిక్కన శివదేవయ్యను దర్శించి—చక్రవర్తితో

'మనుజనాథ—ఈత డీశ్వరుడగాని—
మానవుడు కాడ'ని ప్రశంసించినట్లు, సిద్ధేశ్వర చరిత తెలుపుచున్నది.

సౌప్తిక పర్వములో ద్వితీయాశ్వాసమున—'ధర్మరాజునకు కృష్ణుడు శివప్రభావంబు చెప్పుట' అను ఘట్టములో—

'తెల్లమిగాఁగ నేను
శివదేవు నెఱంగుదు' (109.)

అన్న పద్యపాదమున—శ్రీకృష్ణుడు నేను 'శివు నెఱుంగుదు' అనుటకు బదులు, నేను 'శివదేవు నెఱుంగుదు' అని తిక్కన చెప్పించుటయు. నిచటను—పురుషార్థసార కృతికర్త శివదేవయ్య యని గ్రహింపవచ్చును.

ఈ రీతిగా, లోతుగా, తిక్కన భారతమును, పరిశీలింపవలెనని విద్వల్లోకమునకు విజ్ఞప్తి చేయుచున్నాను. [సమాప్తము]

---

12. నా తెలుగు కవుల చరిత్ర—ద్వితీయ సంపుటము తిక్కన విషయము. ఇందు, తిక్కన కాలమునగాని—అంతకుముందుగాని వైష్ణవమతము—(విశిష్టాద్వైతమతము) లేదనియు. మల్లికార్జున పండితుని నాటికి (క్రీ. శ. 1160) ఆతడు ఖండించిన మతములలో వైష్ణవము లేకపోవుటచే నప్పటికది తెలుగుదేశమున ప్రవేశింప లేదనియు చారిత్రకముగా నిరూపితమైనది. తెలుగుదేశమున ద్రాక్షారామములో హరిహర దేవాలయమున్నకతన హరిహరారాధన తిక్కన కన్నముందు వెలిసినదని—అందుచే పండితుడు దానిని ఖండింపవలసి వచ్చెనని యనేకాంశములును ప్రమాణముగా దెలుపబడినవి. ఈ గ్రంథ మముద్రితము.

13. ప్రథమాంధ్ర కవితా పితామహుడు శివదేవయ్య భారతి—జూన్ 1952.

14. సకలనీతి సమ్మతము — ప్రథమ ముద్రణము—ఆంధ్ర గ్రంథమాల 1923. ద్వితీయ ముద్రణము—ప్రస్తుత వ్యాసకర్త—విపుల పీఠికలతో కూడ నది డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావుగారి సంపాదకత్వమున — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రకటించినది.

# ఆశాగీతం

శ్రీ టి. రాఘవేంద్రరావు

ఆనాడు ఆలపించిన ఆశాగీతాన్ని
ఈనాడు అనలేక పోతున్నాను
ఆరోజు వెన్నెల కురిసింది రాత్రి
ఈరోజు మండిపోతోంది ధాత్రి.

వినీల కుంతలాల్లో విరిసిన మల్లెలు
తమాల పల్లవశాఖల్లో మెరిసిన మిణుగురులు

కవితాకన్య తొడిగిన జలతారు తెరలు,
బంగారు కలలు కరిగిన క్రొన్నెల వెన్నెలలు,
నిశా స్వప్నాలకై నిద్రించాను అప్పుడు
కలలు కనడానికే భీతిల్లుతున్నాను ఇప్పుడు.

ఏమిటి చెప్మా ఈ మార్పు
ఎందుకు చెప్మా ఈ తీర్పు.

నేను కోల్పోయిన హక్కులు నన్ను వెంటాడుతున్నయ్
నేను పదిలంగా దాచిన బుక్కులు నను వేటాడుతున్నయ్.

ప్రభూ ! ఏమిటిదంతా ?

నిష్కళంక ప్రకృతిని ప్రసాదించావ్ నువ్వు
నిర్జీవ కుసుమాలతో ఆరాధిస్తున్నాను నేను.

వంచితుల కళ్ళల్లో దాగిన కన్నీరు
దుఃఖితుల యెడదల్లో కాగిన పన్నీరు
వర్షంగా కురిసి ధరిత్రిని తడిపేస్తున్నయ్
హర్షం నశించి నా కళ్ళు తడుస్తున్నయ్.

మాటలు పెగలని
శబ్దం వెలికిరాని
నిశ్శబ్ద నీరవ రోదన
కవితకాదు, ఆవేదన.

ఆ జాలి పూలతో నిన్నారాధిస్తున్నాను
ఆ వేడి కన్నీటితో నిన్నభిషేకిస్తున్నాను.

జనావళి దుఃఖాన్ని వహించు
ఈరోజు నన్నుద్ధరించు
నా పూజ స్వీకరించు.

---

# రెండవ సింగభూపాలుడు

## శ్రీ యస్. దాశరథి

క్రీ. శ. పదునాల్గవ శతాబ్ది పూర్వార్ధమున జరిగిన హిందూరాజ్య పునరుద్ధరణానంతరము వర్ధిల్లిన రాజములలో రేచెర్ల పద్మనాయక వెలముల రాచకొండ రాజ్య మొకటి. మహాపురుషుని, పిమ్మట కాకతీయ సేనానులుగా నున్నవారిని వదలిన, ఈ వంశమున మొట్టమొదటి రాజుగా పరిగణింపదగినవాడు మొదటి సింగ భూపాలుడు[1]: ఈతడార్జించిన రాజ్యమును సుస్థిర మొనరించి, ఎక్కువగ విస్తరింపచేసి తెలంగాణమున కంతకు అధినేతలై పరిపాలించినవారు అనపోత, మాదానాయకులు. వీరి ఓరుగంటి విజయముతో వెలమరాజ్యమునకు ఉత్తర దక్షిణములందు గోదావరి, శ్రీశైలములును, పూర్వపశ్చిమములందు కొండవీడు, బహ్మనీ రాజ్యములును సరిహద్దులైనవి. వీరు తమలో తాము రాజ్యమును పంచుకొని అనపోతానేడు ఆతని సంతతి వారు రాచకొండను, మాదానేడు అతని సంతతి వారు దేవరకొండను రాజధానులుగా చేసుకొని పరిపాలించిరి.

అనపోతానేని తరువాత రాచకొండ సింహాసనాధిష్ఠితుడైనవాడు, అతని సుతుడు రెండవ సింగభూపాలుడు. ఈతని తల్లిపేరు అన్నమాంబ. శాసనములందు పెదసింగమనాయడనియు, గ్రంథములందు కుమారసింగభూపాలుడనియు వ్యవహరింపబడెను. విశ్వేశ్వర కవియు, బొమ్మకంటి అప్పయార్యుడు, ఈతని సమకాలికు లగుటవలన తాతయగు మొదటి సింగ భూపాలునినుండి తనని వేరుచేయుటకై కుమారసింగ భూపాలుడని పిలచిరని యూహింపవచ్చును. పెదసింగమ నాయడని వ్యవహరించుటకు కారణము శక వర్షములు 1386 నాటి ధర్మారాయుని శాయంపేట శాసనము నాటికి మూడవ సింగము నేడుండుటయే.[2]

ఈతడు రాజ్యమునకు రాక పూర్వమే తండ్రి వద్ద రాజ్య వ్యవహారజ్ఞతను పొందినట్లీతని యాస్థాన కవుల వ్రాతలనుబట్టి తెలియుచున్నది. యుద్ధములందును అనుభవము గడించెను. తండ్రి రాజ్య కాలములోనే గుల్బర్గ ప్రాంతమందలి చరిత్ర ప్రసిద్ధమైన కల్యాణ దుర్గమును జయించి అచట కీర్తి స్తంభమును ప్రతిష్ఠించి 'కల్యాణ భూపతి' బిరుదు వడసినట్లు విశ్వేశ్వరకవి 'చమత్కార చంద్రిక' యందున్నది. కాని, ఈత డేసందర్భమున నీ కార్యమును సాధించినది, ఎవరికి సహాయభూతుడుగ వెళ్లినది చెప్పి యుండక పోవుటచే యిదమిద్ధమని నిర్ణయింప వలను పడదు. బహ్మనీసుల్తానులతో అత్యంత స్నేహము నెరపుచున్నట్లు 'ఆ చమత్కార చంద్రిక' యందే చెప్పి యుండుటవలన విజయనగర—బహ్మనీ రాజుల యుద్ధము లందెప్పుడో విజయనగర రాజులకు ప్రతికూలముగా బహ్మనీ సుల్తానులకే కల్యాణ విజయము కూర్చినట్లూహింపవచ్చును.

ఈతడు సింహాసన మధిష్ఠించిన సరియైన సంవత్సరము చెప్పుట కాధారములు లేవు. అయినను అనపోతానేని శాసనములు శకవర్షము 1302 వరకుండుట వలనను[3], యీ వసుపతి శాసన మొకటి సింహాచల

---

1. Inscriptions in the Telingana districts of the Hyderabad State: Series No. 19 Dr. P. Sreenivasachar.

(Ayanavolu Inscription of Anapota Nayaka VSS 10-12.

2. విజ్ఞాన సర్వస్వము, 3 వ సంపుటము తెలుగు సంస్కృతి.

P. 298 (Lines 28—40 : Jayampeta Inscription (Hyderabad Archaeological Series No. 19.)

3. వెలుగోటివారి వంశచరిత్ర: వెల్లాల సదాశివశాస్త్రి, అనుబంధము, సంఖ్య 5, S. I. I. Vol. No. 1031.

మందు[4] శకవర్షము 1309 నాటికే యం ఘ కార ణమున యీతడు శకవర్షములు 1303– 4 లో రాజ్యమునకు వచ్చియుండును. ఈతడు సింహాసనము నధిరోహించిన క్రొత్తలలోనే కాబోలు విజయనగర రాజులతో యుద్ధము సంప్రాప్తించినట్లు తోచు చున్నది. శకవర్షము 1306 నాటి మైసూరులోని తుంకూరు ప్రాంతమందలి చిక్కనాయకుని హళ్లి శాసనమును[5] అనుసరించి విజయనగరాధీశ్వరుడగు రెండవ హరిహర రాయలు శ్రీశైల ప్రాంతము జయించి, కుమారుడగు వీరబుక్కరాయలను ఓరుగంటి రాజ్యముపైకి పంపెను. విజయనగర సైన్యమును తురకలు క్రొత్తకొండవద్ద మార్కొనినట్లు శాసనము నందున్నది. ఆ సంగ్రామమందు విజయనగర దండ నాథులలో నొకడగు రామదేవరాయలు హతుడయ్యెను. ఈ శాసనమునందు వెలమదొరల ప్రస్తావము లేదు. కాని ఓరుగల్లు, క్రొత్తకొండ, యీ కాలమునాటికి వెలమ ప్రభువుల అధీనమునందుండినట్లు మనకు శాసనములవలన తెలియుచుండుటవలనను, చమత్కార చంద్రికయందు వెలమ - బ్రహ్మనీల మైత్రిసిగూర్చిన ప్రస్తావముండుటవలనను వెలమ ప్రభువు బ్రహ్మనీ సేనల సహాయముతో నా యుద్ధమందు పాల్గొని నట్లూహించుట సత్యదూరము కానేరదు. ఈ యుద్ధము నందు పెదవేదగిరివేడు కూడ పాల్గొనెను. వెలుగోటి వారి వంశావళియందు దీతడు 'ఏకశిలానగర సవిూప శాత్రవారణ్యదహన దావానల' యను బిరుదుగాంచి నట్లు పేర్కొనబడినది.[6] పూర్వోక్త యుద్ధ సంద ర్భమునందే యీ బిరుదు వచ్చియుండును. ఈ యుద్ధమునకు కారణమేమైయుండునో! విజయ నగరాధిపతి, ముసునూరి కాపయయు బంధువులని జియావుద్దీన్ బరనీ వ్రాసియున్నాడు. బాంధవ్యమున్నను లేకపోయినను హిందూరాజ్య పునరుద్ధరణమున నొకరి కొకరు సహాయము చేసుకొని మహ్మదీయ విజృంభణము నరికట్టి అత్యంత మైత్రితో మెలగుచుండిన సమయ మున వెలమదొరలు కాపానేసి చంపి తెలంగాణము నంతను నాచికొని బహ్మనీ సుల్తానులతో మైత్రి నెరపుచుండుట విజయనగరాధిపతికి కంటకముగా నుండెను. ఈ వెలమ—బహ్మనీల మైత్రిని విచ్ఛిన్న మొనరించి ఆంధ్రాధీశ్వరుల శక్తిని సన్నగిల చేయుటకే పై సంఘర్షణలు సంభవించియుండును. కాని విజయ నగరాధిపతి యుద్దేశ్యము సఫలీకృతము కాలేదని పూర్వోక్త సంఘటనలు విశదపరచుచున్నవి.

ఈ విజయముతో విజయనగరాధిపతి వలన వెలమ రాజ్యమునకు గలుగుచుండిన ఉపద్రవములు కొంత తగ్గినవి. రాజ్యమునందు కొంత సుస్థిరత యేర్పడినది. ఇంతకుమునుపే అనపోతానేడును, మాదా నేడును, అనవేమారెడ్డి విజృంభణము నరికట్టిరి. అనవేమారెడ్డి భృత్యుని శాసన మొకటి[7] శకవర్షములు 1299 నాటిది వాడపల్లియందున్నది. దీనినిబట్టి అనవేముడు ఆ కాలమునకు కృష్ణకు ఉత్తరదిశన వెలమ రాజ్యములో కొంత ప్రాంతమును వశపరచుకొని పాలించుచుండినట్లు గ్రహింపవచ్చును.

ఈ పరిస్థితిని సహింపజాలక మాదానాయకుడు దక్షిణమందు వాడపల్లి ప్రాంతముల అనవేమారెడ్డిని మార్కొని ఓడించెను. ఈ విజయముతో మాదా నాయకుడు అనవేమారెడ్డిని కృష్ణకు దక్షిణము వైపు నకు పారద్రోలి వాడపల్లి ప్రాంతమున దిరుగ ఏకీక రించుకొని కృష్ణానదిని వెలమ రాజ్యమునకు దక్షిణపు ఎల్లగ సుస్థిర మొనర్చినాడు. ఈ సంఘటన శక వర్షము 1302 ప్రాంతమందు జరిగి యుండనోపు. సరిగా యిదే సమయమునకు అనపోతానేడు అనవేమా రెడ్డి యధీనములో నుండిన దక్షిణ కళింగముపై దండయాత్ర కావించెను. దీని కాధారము శకవర్షము 130? నాటి అనపోతని సింహాచల శాసనము[8]. ఈ విధముగ అన్నదమ్ములు అనవేమారెడ్డి రాజ్యముపై దాడులు జరపి యాతని శక్తిని ఏకోన్ముఖము గాని యక తుదకాతని నోడించి తమ రాజ్యమునందలి దక్షిణ భాగమున అనవేమారెడ్డి యాధిపత్యమును నిశ్శేషము గావించిరి. శకవర్షములు 1299 తరువాత అనవేముని శాసనములు తెలంగాణయందు కన్పింపక

4. South Indian Inscriptions, Vol. VI No. 1036.

5. Epigraphia Carnatica XII (K.11?).

6. వెలుగోటివారి వంశావళి Edited by Dr. N. Venkataramanayya, P. 3?.

7. Archaeological Reports of the Hyderabad State 193? – 35 (134? F) Appendix

8. South Indian Inscriptions: Vol. V No. 1081.

పొవుటయు, వెలుగోటి వారి వంశావళి[9] యందు అనవేముని మాదానాయకుడు ఓడించినటుల చెప్పి యుండుటయు పై యూహ కాధారములు.

అనపోతానేని దక్షిణ కళింగ దండయాత్ర యొక్క దోపిడివంటిది మాత్రమే. అనవేముని ద్రాక్షారామం.[10] మాన్యమాపుర[11] శాసనములు యీ విషయమును బలపరచుచున్నవి. వెలమ రాజులకి యుద్ధము వలన అధిక ఫలితము లభించినట్లు కన్పట్టదు. అయినను పై దండయాత్ర వెలమలకు కొంత యుత్సాహమును ధైర్యమును కలిగించినవి. సింగభూపాలుడు సింహాసనము నధిష్ఠించిన పిమ్మట కళింగముపై వచియెకసారి యెక్కువ సంరంభముతో దాడి జరిపెను. శకవర్షములు 1309 నాటికి శాసన మొకటి సింహాచలములో నున్నది[12]. దీనినిబట్టి యితడా సంవత్సరములోనే దక్షిణ కళింగ దండయాత్ర చేసియుండునని యూహింప నగును. కొమరగిరిరెడ్డి సింహాసనము నలంకరించి అప్పటి కింకను ఒక సంవత్సరమైనదో, లేదో కాని సింహాసనమునకై ప్రకటిన అంతఃకలహముల మూలమున అతని యధికార మింకను స్థిరపడలేదు[13]. రెడ్డి రాజ్యముయొక్క అరక్షితస్థితిని గమనించి, సింగభూపాలుడు కళింగము మీదుగా గోదావరీతట ప్రాంతములపై దాడి సలిపెను. ఈ దండయాత్ర సందర్భముననే గజపతిని గూడ ఓడించియుండును. అందులకు చమత్కార చంద్రిక యందుండు ఈ క్రింది శ్లోక మాధారము.

సా [స్నేహో] మోల్లాసిని పారసీక నృపతౌ
సంధాను సంధాయకే।
కన్యారత్న సమర్పణాత్ గజపతౌ
సంబంధ గంధ స్పృశి।
రేచర్ల న్వయు శార్జిణాం నరపతిం
ద్రష్టుం రణే సాహసం।
సంభావ్యం స [న] హి గౌతమీ
పరిసర క్షుద్ర క్షమాభృద్గణే॥

శ్రీ వడ్డాది అప్పారావుగారు మొదటి పాదమందలి మొదటి పదమును 'సామోల్లాసి'గా దిద్దినారు. స్నేహోల్లాసిని యనినా సామోల్లాసిని అని చెప్పుకొనినా అంతగా తేడా కలుగదని నా అభిప్రాయము. పై శ్లోక సందర్భమున శ్రీ వడ్డాది అప్పారావుగారీ క్రింది విధముగా సెలవిచ్చిరి.

'డా. వెంకటరమణయ్యగారు దీనినిబట్టి గజపతితో యుద్ధము జరిగెననియు, అందాతడు ఓడెననియు, పిల్లనిచ్చి రాజీ చేసుకొనెననియును తలచుచున్నారు. ఈ యూహలను బలపరచు చారిత్ర కాధారములు ఏమియు ను లేవు. పై శ్లోకములోని విషయములు యదార్థములైనచో బహ్మనీ సుల్తానులతో సింగానాయుడు యుద్ధముచేసి గెల్చెననియు, వారు సంధి కోరుకొన్నట్లును, చారిత్రకాంశముగా చెప్పవలెను. కాని వెంకటరమణయ్యగారు అంత దూరము పోలేదు'[14]. వెలుగోటివారి వంశావళియందు సింగభూపాలునిపై గజపతికి కొండెములు చెప్పినవారిని కంటగించుకొనుచు పద్యము వ్రాయబడియున్నది[15]. విశ్వేశ్వరుడు వివాహమును గూర్చి ప్రస్తావించినాడు[16]. కావున మొదట యుద్ధము చేయుటకై గజపతి వచ్చి అందు ఓడిపోయి కన్య నిచ్చి సంబంధము కలుపుకొనినట్లు వ్రాయుట యాధార రహితము గాదు. బహ్మనీ సుల్తానులతో ఆ విధముగనే యుద్ధము జరిగినట్లు చెప్పుకొనుటకు వీలుపడదు. సామము, స్నేహము అనునవి యుద్ధమందు ఓడిపోయిననే కలుగునవి గావు. రాజకీయ పరిస్థితులను అనుసరించి రాజులు రాజకీయ స్నేహములు చేయుచుందురు. ఈ పరిస్థితి యందటువంటి యవసరములు బహ్మనీ–వెలమ రాజులకు కలిగినవేమో విచారింపవలయును. ఇంతకు

---

9. వెలుగోటివారి వంశావళి Ibid పద్యము 108 P. 39.

10 South Indian Inscriptions: Vol. IV No. 13-7.

11. Elliots Epigraphical Collections: No. 20 of 1915.

12. South Indian Inscriptions Vol. VI No. 1086.

13. History of the Reddi Kingdoms: by M. Somasekhara Sarma P. 125.

14. రెడ్డి సంచిక సంపాదకులు శ్రీ వడ్డాది అప్పారావు 1947 A D.

15. వెలుగోటివారి వంశావళి: Ibid పద్యము 139 P. 55

16. Chamatkara Chandrika: Govt. Oriental Mss. Library, R. No. 2619 P 144.

మునుపు శక వర్షము 1302—3 ప్రాంతముల మహ్మదు షా గోవా ప్రాంతముల విజయ గర రాజు లతో ఓడియుండెను.[17] శకవర్షము 1306 లో బహ్మనీలు వెలమలకు విజయనగర రాజులతో జరిగిన యుద్ధమున సహాయము గావించియుండిరి. మొదటి దేవరాయల పరుచూరు తామ్ర శాసనములను పరి శీలించినయెడల శకవర్షము 1309, 10 యందు రెండవ మహ్మదుషా విజయ న ర రాజులపై దండెత్తు సమకట్టి యుండినటుల తెలియుచున్నది.[18] వెలమలు అదే సమయమునకు దక్షిణ కళింగ, గోదావరితట ప్రాంతములపై దాడి సలిపిరి. ఈ పరిస్థితులు వెలమ లకు, బహ్మనీలకు మైత్రి లేనియెడల సంభవించి యుండవు. శకవర్షములు 1312 లో బహ్మనీ సేనలు విజయనగర రామచంద్రఒడయరు చేతిలో పరాజయము నందినవి. ఇట్టి పరిస్థితులలో బహ్మనీలు వెలమలను వైరములు పెట్టుకొని తమలో తాము యుద్ధమునకు దిగిరని చెప్పట యుక్తము గాదు. కావున బహ్మ నీలకు, వెలమలకు స్నేహమునియే శ్లోకము నందలి పాదమునకు అర్థము చెప్పుకొనవలయును కాని, యుద్ధమునందు బహ్మనీలు ఓడి సంధి చేసుకొనినట్లు చెప్పుటకు వీలుపడదు చిన్నచిన్న రాజులుగా కొమర గిరిని, గోదావరి తటమునందలి సూర్యవంశపు రాజులను యలమంచిలి చాళుక్యులను మన్నెదొరలు మొదలగు వారిని ఉద్దేశించి చెప్పబడినట్లుగా నూహించుటలో గొప్ప తప్పేమియు లేదు. కొమరగిరి అప్పుడే సింహా సనము నధిష్ఠించినాడు. సింహాసనమునకై కుటుం బములోని అంతఃకలహములచే సుస్థిరత లేక బల హీనుడుగానే యున్నాడు కొమరగిరి. శకవర్షము 1308 నాటి కాటయవేముని సింహాచల శాసన మును [19]అనసరించి అతడు స్వామి రాజ్యసంరక్షణ మునకై కొంత ప్రయత్నముచేసి యుండవచ్చును. గజపతికి కొండెములు చెప్పి పిలిపించుట అట్టి ప్రయ త్నముల లోనిదే కావచ్చును. శకవర్షము 1312 నాటి అనపర్తి తామ్రశాసనాధారముగా రెడ్డిరాజులు వెలమ రాజులతో సంధి కావించుకొని మైత్రి కొలుపుచున్న ట్లూహింపవచ్చును[20]. ఈ విధముగా సింగభూపాలుడు దండయాత్ర విజయవంతముగా సాగించి స్వదేశము నకు మరలి వచ్చెను. ఈ దండయాత్రవలన స్థిర ఫలితము లెవ్వియు లేకపోయినను వెలమల శక్తి సామ ర్థ్యముల నది చక్కగ ప్రకటించినది.

సింగభూపాలుడు తన పరిపాలనాంతిమ కాలము నందుకూడ విజయనగర రాజులతో యుద్ధములు చేయవలసి వచ్చెను. విజయనగరాధీశ్వరుడైన రెండవ హరిహరరాయలు శకవర్షము 1306 నందు వెలమల చేతిలో పొందిన పరాభవమును మరువలేదు. వెలమ— బహ్మనీల మైత్రి నెటులైనను విచ్ఛిన్న మొనరించి వెలమ ప్రభువులపై తన పగ దీర్చుకొనుటకై వేచి యుండెను. తుదకు శకవర్షము 1319 లో తన పుత్రుడైన మొదటి దేవరాయలను తగిన సైన్యముతో వెలవ రాజ్యముపై దండెత్త బంపెను. ఉదయగిరి నుండి రాయల సైన్యము బయలుదేరి నల్గొండ, వరంగల్లు జిల్లాలను దాటి కరీంనగ రుజిల్లా మంథెన తాలూకాలోని కాళేశ్వరమువద్ద విడిసినవి. రాయల సైన్యములకు అడ్డుమాకలు లేక పోయెను. ఈ దండ యాత్రయందు దేవరకొండ, రాచకొండాధిపతులు పూర్తిగా నోడిపోయిరనట స్పష్టము. దిగ్విజయా ర్థమే తెంచిన వీరాధివీరుడైన దేవరాయలు వెలమ ప్రభువులను పరాజయ మొనరించి వెలమ రాజ్య మును దక్షిణకొననుండి ఉత్తరపుటంచుల వరకు అల్లకల్లోల మొనర్చి గోదావరితట ప్రాంతముల వరకు సేనను నడిపి కాళేశ్వరమువద్ద తులాభారము తూగెను.[21] ఈ దండయాత్ర వలన కలిగిన విషమ పరిస్థితులనుండి వెలమ ప్రభువులు త్వరలోనే కోలు కొని విజయనగరాధిపతులను ధిక్కరించి బహ్మనీల సాయముతో యథాపూర్వము పరిపాలన సాగించిరి. అందువలననే కాబోలు రెండవ హరిహరరాయలు మరల ఆరునెలలకే బుక్కరాయల ఆధిపత్యముక్రింద ఇరుగవ దండనాథుని సేనాధిపతిగ నొనరించి ఆంధ్ర దేశాధీశ్వరులపై దాడి జరిపెను. బుక్కరాయలు తన

---

17. విజ్ఞాన సర్వస్వము, 3 వ సంపుటము తెలుగు సంస్కృతి P. 34 తెలుగు భాషా సమితి.

18. N. D. I. Volume I. C. P. No. 1.

19. South Indian Inscriptions: Vol VI. No. 701.

20. Journal of the Andhra Histori-cal Research Society Volume XI PP. 203-4.

21. Annual Report on Indian Epi-graphy for 1958—59 P, 15 Appendix B No. 90 P. 37.

సైన్యముతో కృష్ణను అతిక్రమించి దేవరకొండ రాజ్యమునందలి పానుగల్లు కోటను ముట్టడించెను. ఈ పానుగల్లు సంగ్రామమునందు బహ్మనీలు వెలమలకు సహాయ మొనర్చి[22]. బుక్కరాయల సూనుడు అనంతభూపాలుడు యీ యుద్ధము నందు అసమాన శౌర్య పరాక్రమములను చూపెను. విజయనగరాధీశ్వరులు విజయులైనట్లు పానగంటి దుర్గమునందలి శకవర్షము 1319 నాటి బుక్కరాయల శాసనమును బట్టి చెప్పవచ్చును[23].

ఈ సంగ్రామమునందే పెదవేదగిరి నేడు స్వవిజయమునకై మిక్కిలి కృషిసలిపెను. వెలుగోటి వారి వంశావళియందు గూడ దండనాథుని వధించినట్లుగా ప్రకీర్తితుడైనాడు. గుండ దండనాథుడు రెండవ హరిహరరాయల సేనానాయకులలో నొకడని చరిత్రకారులు గుర్తించిరి. ఈ గుండ దండనాథుని శాసన మొకటి శకవర్షము 1319 నాటిది యుండుట వలన ఈతడు శకవర్షము 306 నాటి వెలమలతోడి సంగ్రామమునందు గాక ఈ పానుగల్లు సంగ్రామము నందు పెదవేదగిరినేని చేత వధింపబడి యుండును.

ఈ పానుగంటి సంగ్రామమయిన పిమ్మట కొలది సంవత్సరములకే కుమార సింగభూవరుడు పరలోక గతుడయ్యెను. శకవర్షము 1329 నాటి సింహాచల శాసనము[24] పెదవేదగిరినేనిని ఉదహరించునే కాని సింగభూపాలునిగూర్చి తెలుపదు. ఈ పెదవేదగిరి నేడు 13 6 శకవర్షము నాటికే అన్నదేవునికి సహాయముగా గోదావరి ప్రాంతములపై దాడి పోయినట్లు చెప్పకొనిన కాలమునాటికే సింగ భూవరుడు మరణించి యుండవచ్చునని ఊహింపవలయును. అటులయిన 1320 నుండి 1326 శకవర్షముల లోపల యీ భూవరుడు మరణించి యుండునని అభిప్రాయము.

ఈ సింగభూపాలుడు యుద్ధతంత్రనిపుణుడు. చిన్నతనమునుండి అంత్యకాలమువరకును యుద్ధము లందే తన జీవితమును వెచ్చించెను. ఈతనికి ఆంధ్ర మండలాధీశ్వర, ప్రతిగండభైరవ, ఖడ్గనారాయణ బిరుదములు గలవు. ఈతని శౌర్య సాహసముల గురించి వెలుగోటివారి వంశావళి గొప్పగ చెప్పచున్నది. అంతియేగాక గొప్ప విద్వద్వరేణ్యుడు, కవిపోషకుడును. విశ్వేశ్వరుడు, అప్పయార్యులనంటి పండితుల పోషించి వారిచే పొగడ్తలనుపొందిన ధీశాలి. స్వయముగా గొప్ప కవియు, పండితుడను. ఈతడు 'సింగభూపాలీయ' మను నామాంతరముగల 'రసార్ణవ సుధాకర' మను అలంకార శాస్త్రమును సంస్కృతములో రచించెను. ఇదిగాక 'రత్నపాంచాలిక' లేక కువలయావళి' యను నాటకమును, శార్ఙ్గధరుని సంగీత రత్నాకరముపై 'సంగీత సుధాకర' మను వ్యాఖ్యను కావించెను. సంస్కృత సాహిత్యమునందీతనికి గల వైదుష్యమును ఈతని రసార్ణవ సుధాకరమునుండి తెలుసుకొనవచ్చును. పలువిధములయిన లక్షణములుగల్గిన గద్యలను శ్లోకములను ఉదహరణ కొరకై వివిధ సంస్కృత నాటకములనుండి గ్రహించి యిందు పొందుపరచి, ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగ నొనర్చెను. 'రత్నపాంచాలిక' యందు శ్రీకృష్ణునితో 'కువలయావళి' వివాహమును యితివృత్తముగా చిత్రించెను రాచకొండయందలి ప్రసన్న గోపాలదేవుని వసంతయాత్రా మహోత్సవములలో యీ నాటకము ప్రదర్శింపబడినట్లు కూడ మనకు తెలియుచున్నది. ఈ నాటకమందు తనను తానే లలితకవితావిలాసచతురాననుడనని చెప్పకొనెను. ఈతని ఆస్థాన కవియైన బొమ్మకంటి అప్పయార్యుడు యీతని లక్ష్యలక్షణవేది యనియు, సర్వజ్ఞ చూడామణి యనియు పొగడెను. ఈ అప్పయార్యకవి 'అమరుకోశ వ్యాఖ్య'ను రచించెను. ఈ భూపాలుని ఆస్థాన కవులలో గొప్పవాడు విశ్వేశ్వర కవి. ఈతడు గొప్ప సంస్కృత గ్రంథకర్త. ఈ కవి 'చమత్కార చంద్రిక' యను గొప్ప లక్షణ గ్రంథమును, యితర గ్రంథములు పెక్కుల రచించెను. ఇట్లు సాహిత్యాభివృద్ధికి తోడ్పడి, విద్వజ్జనులకు ఆలవాలమై, ప్రజానురంజకముగ పరిపాలించిన ఈ వెలమ వంశావతంసము చిరస్మరణీయుడు.

---

22. Further sources of Vijayanagara History: Dr. N. Venkataramanayya.

23. 'వెలుగోటివారి వంశావళి'—Edited by Dr. N Venkataramanayya, P. 224 & 5.

24. South Indian Inscriptions Volume VI No. 1100.

# నా కవిత

శ్రీ జి. వి. సుబ్బారావు

ఛందం

నా భావనా విహంగానికి
రక్త సంబంధం !
ప్రాస
నా కవితా హృదయానికి
జీవనశ్వాస !
యతి
నా రచనా వ్యాసంగానికి
రమ్య నియతి !
ఛందోబద్ధగతి
అందమైన నా కవితా
ఝరీగతి !
ప్రాస ప్రసవాకృతి
రసవ్యంగ్య ధ్వనిభ్రమర
సంకేతాకృతి !
యతి పొల్లుపోని సంగతి
అతిరమణీయార్థ ప్రతిపాదక
సుకృతి !
ఛందస్సులు నన్ను బంధింపవు
అందాల పథాలలో విహరింపజేస్తాయి !
ప్రాసలు నన్ను ప్రశ్నింపవు
ప్రాకృతభావ పరీమళాన్ని వెదజల్లుతాయి !
యతులు నాకు నియతులు కావు
యాతాయాత కావ్య సౌరభలహరిని ప్రవహింప
జేస్తాయి !

నా ఛందం
భావఝరీలయాను బంధం
నా ప్రాస
నిత్యనూతన జీవితాను ప్రాస !
నా యతి
సర్వమానవ శ్రవణానంద సంగతి
నా గీతం
శతకోటి హృదయంవల్లకీ మధుర సంగీతం
నా గేయం
అతిలోక ప్రణయ కుసుమ పరీమళధ్యేయం
నా గళం
ఆనంద వేదనాతీత నాదస్వర సమ్మేళనం !
నా కవిత
నవనవోన్మేష భావనాసూన సౌరభ పరీపక్వత !!

---

# అలజడి

## శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

కిటికీ బాగా ఎత్తుగా వుండడంవల్ల అతనికి కనిపించడం లేదుగాని, ఆకాశం ఘోరమైన రణరంగంలా వుంది. మబ్బులు గుమికూడి గర్జిస్తున్నాయి. సన్నగా జల్లుపడుతున్నది. మరి కాస్సేపటిలో కుంభవృష్టి తప్పదనిపిస్తున్నది. జలార్ద్రమైన నల్లని మబ్బుల వెనక గొప్ప కోలాహలం. అలజడి....

బయట బరువైన బూట్ల సవ్వడి...

మోకాళ్ల చుట్టూ చేతులు కట్టుకుని కూర్చున్న గాంధీ తల ఎత్తిచూశాడు. కటకటాల అవతల వరండాలో నిలబడి బీడీ కాల్చుకుంటున్నాడు అప్పలస్వామి. రెండు దమ్ములు పీల్చి, వరండాక్రిందికి ఉమ్మివేసి, వెనుదిరిగి కటకటాలకు దగ్గరగావచ్చి నవ్వుతూ 'ఏం బాబూ! నిద్రపట్టలేదా?' అని అడిగాడు గాంధీని.

గాంధీ తల అడ్డంగా ఊపాడు. అప్పలస్వామి మళ్లీ ఏదో మాట్లాడబోయి అంతలోనే విరమించుకుని నెమ్మదిగా నడిచివెళ్లి పోయాడు. అతని బూట్ల సవ్వడి ఆ వరండాలో క్రమంగా దూరమైపోయింది.

గాంధీ ఉన్నట్టుండి లేచి కళ్లజోడు తీసి తుడుచుకుని ఆ చిన్నగదిలో చేతులు వెనక్కు కట్టుకుని అటూ యిటూ పచార్లు చెయ్యడం ప్రారంభించాడు.

బయటవర్షం కొంచెం పెద్దదయింది. బుల్లిపిట్ట ఒకటి—దాని రంగు ఏదో సరిగా తెలియడం లేదు. అంతరాత్రివేళ ఎందుకు వచ్చిందో మరి, కిటికీలో నిలబడి సన్నగా అరుస్తున్నది. అది బహుశా పూర్తిగా తడిసిపోయి వుండాలి. గాంధీ ఆగి చూశాడు. ఒక నిముషం గడిచి వుంటుంది. ఆ పిట్ట, పాపం, లోపలకివస్తే బాగుండుననిపించింది. కాని అది రాలేదు. కొద్ది క్షణాల్లో చిన్న చిన్న రెక్కలు విదిలించుకున్న ధ్వని. ఆ వెనువెంటనే అది ఎగిరిపోయిన మృదువైన సవ్వడి...ఆ తర్వాత అంతా నిశ్శబ్దం...

కిటికీలోనుంచి ఆకాశం, కత్తిరించిన నల్లని కాగితం ముక్క లాగున్నది. కిటికీ అవతల ఏమున్నదో తెలియదు. బహుశా, అది అంతా ఖాళీ స్థలం కావచ్చు. ఆ పైన బలమైన కొండరాళ్లతో కట్టబడిన ఎత్తయిన ప్రహరీగోడ ఉండే వుంటుంది. ఆ ప్రహరీపైన గాజుపెంకులు దట్టంగా బిగించబడి వుంటాయి.

ఎక్కడో గంటలు కొడుతున్నారు. గాంధీ ఆగి చెవులు రిక్కించి వింటూ, వ్రేళ్లు మడుస్తూ లెక్కపెట్టాడు. మొత్తం తొమ్మిది గంటలే వినిపించాయి. ఇప్పుడు తొమ్మిదేనా అయింది? కాదు. బహుశా గాలివాలు కారణంగానూ, వర్షపు జల్లు మూలంగానూ, కొన్ని గంటలు తనకు వినబడి వుండవు.

మళ్లీ అప్పలస్వామి వరండాలో నడచి వచ్చాడు. అతడు గాంధీవంక ఆ సన్నని వెలుతురులో ఒకసారి చూసి కటకటాలమీద చేతితో మీటుతూ 'ఇవాళ కోర్టులో ఏమయిందు?' అని అడిగాడు.

గాంధీ చేతివ్రేళ్లు విరుచుకుని చప్పరించి 'ఏమీ కాలేదు...' అన్నాడు.

'అంటే విచారణ జరగలేదా?'

'జరిగింది...'

'అదే. ఏం జరిగిందీ అని అడుగుతున్నాను.!

గాంధీ నుదురు తుడుచుకున్నాడు. ఒక్కక్షణం ఆగి నెమ్మదిగా ఏమీ జరుగలేదు. అన్నట్టు కాసిని కాయితాలూ, కలమూ కావాలని అడిగాను కదా! ఎప్పుడిస్తారు?' అని అడిగాడు.

అప్పలస్వామి అనునయంగా చూశాడు. తర్వాత 'అడిగాను...వీల్లేదన్నారు. అవి అంత అవసరమా?' అన్నాడు.

'అవసరమే...చాలా రాసుకోవాలి... ఎన్నో విష యాలు బుర్రను పాడుచేస్తున్నాయి. రాసుకునే వీలుకుంటే బాగుండిపోను నా పుస్తకాలూ, నేను రాసుకున్న కాయితాలూ అన్నీ ఏం చేశారో ఎవ్వరూ చెప్పడంలేదు. అన్నీ నాకు ముఖ్యమైన సైన్సు పుస్తకాలు' అన్నాడు గాంధీ చాపమీద కూలబడుతూ.

అప్పలస్వామి 'అవన్నీ నీకు ముఖ్యం ... కాని వాళ్లకుమాత్రం అవేవీ పట్టవు. ఒక్క కాయితమే వాళ్లకు ముఖ్యం...ఆ చిన్నచీటి ... ఉత్తరం...' అని ఒక్కక్షణం ఆగి పక్కకు చూస్తూ 'ముసురు బాగా పట్టింది. ఇప్పట్లో తగ్గేట్టులేదు...' అన్నాడు.

తర్వాత మళ్లీ 'ఆ ఉత్తరంలో ఏం రాశావు?' అని అడిగాడు.

గాంధీ మాట్లాడలేదు. అతని కళ్లలో నీళ్ళు తిరుగుతున్నాయి. మనసులో ఏదో అజ్ఞాతకంఠం దిగులుగా గుసగుస లాడుతున్నట్టున్నది.

'గాంధీ అనబడే నేను ...ఎం. ఎస్. సి... న్యూక్లియర్ ఫిజిక్స్... యూనివర్సిటీ మొత్తంమీద సెకండ్...నిరాశా నిస్పృహలతో జీవితంలో ఓడి పోయి...నిరుద్యోగిగా బ్రతకలేక...జీవితాన్ని అంతం చేసుకుంటున్నాను. నాకు ఎవరూ లేరు...కావలసిన వారూ లేరు...శత్రువులూ లేరు. నా చావు కెవరూ బాధ్యులు కారు...ఎవరినీ నిందించను...నా అంతట నేను స్వయంగా చచ్చిపోతున్నాను'. (అవును. ఈ వాక్యం కూడా వ్రాశాడు. అయినా ఇదేం వాక్యం?)'

గాంధీ ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా కూర్చుండిపోయేసరికి అప్పలస్వామి ఒకసారి నిట్టూర్చి మళ్లా వరండాలో నడుముకుంటూ వెళ్లిపోయాడు.

గాంధీ చాపమీదకి వొరిగి గోడ కానుకుని కళ్లు మూసుకున్నాడు. అంతేనా తాను ఆనాడు వ్రాసింది? బహుశా అంతే.. కాకపోతే ఇంకా నాలు గైదు అర్ధరహితమైన వాక్యాలు వ్రాశాడేమో గుర్తు లేదు...అప్పుడు తన మనసంతా ఇప్పటి ఆకాశంలాగే ఘోరంగా అస్తవ్యస్తంగా అరణ్యంలా వుంది. భయం కరంగా కూడా ఉంది.

గాంధీ మళ్లీ కళ్లజోడు తీసి మాసిన లాల్చీ చివరతో అద్దాలు తుడుచుకుని మళ్లీ మొహానికి తగి లించుకున్నాడు. తల తిప్పి గోడవంక చూస్తూ కూర్చు న్నాడు. అకస్మాత్తుగా ఆ గుడ్డివెలుతురులో అతనికి ఆ గోడమీద పెన్సిలుగీతలు కనిపించాయి. కళ్ళు చిట్లించి జాగ్రత్తగా చూశాడు. ఎవరు, ఎప్పుడు గీశారో మరి...

ఒకమున్నా...అది తల ... రెండుగీతలు... అవి చేతులు... తొడలుమాత్రం లావుగా గీశారు. వక్ష స్థలాన్ని సూచిస్తూ మళ్లీ రెండు పెద్దసున్నాలు... అవి అసహజంగా పెద్దవిగా ఉన్నాయి. అంతే... ఇంకేమీలేదు...

అతడు అప్రయత్నంగా నిట్టూర్చి మోకాళ్ల మధ్య తలపెట్టుకుని కూర్చున్నాడు. అతనికి హఠా త్తుగా తల్లిగుర్తుకు వచ్చింది. పదేళ్లక్రిందట— అవును. సరిగ్గా పదేళ్లు— ఆమె చనిపోయేముందు యెలా వుండేదో గుర్తుచేసుకునే ప్రయత్నం చేశాడు. అప్పటికి ఆమెకు బహుశా నలభై ఏళ్లుంటాయేమో! దుఃఖభారంవల్ల, పేదరికంవల్ల మనిషి జవసత్వాలు కోల్పోయి చాలా ముందుగానే వృద్ధురాలైపోయింది. అకాల వార్ధక్యం ఆమెను లొంగదీసుకుని అశక్తు రాలిని చేసింది ఒకనాడు— తాను బడిలోవుండగా-- మధ్యాహ్నం సూర్యుడు నిప్పులు చెరిగేవేళ--- ఆట్టే బాధపడకుండానే చనిపోయింది. అది మొదటిసారి అతడు శవాన్ని చూడటం ... తండ్రిని యెరుగడు... తాను తల్లికడుపులో ఉండగానే తండ్రిపోయాడు. వారూ, వీరూ చెప్పుకోడంమాత్రం గుర్తు.. ఆయనను గురించి అందరూ జాలిగా, సానుభూతిగామాత్రమే అనుకుంటూ వుండేవారు. ఒక్క ఋణదాత తప్ప... అదీ అయిదువందలరూపాయలే... తన తల్లితర్వాత రెండేళ్లకుగాని ఆ అప్పు తీర్చలేకపోయింది. ఎవరో ఒక ముసలాయన తన తండ్రిని గురించి మాట్లాడటం అతనికి బాగా గుర్తున్నది. 'పాపం! మంచివాడు. కలియుగంలో ఉండవలసిన మనిషి కాదు. 'సొతంత్రం ... సొతంత్రం'... అంటూ ఉన్నదంతా కరిగించుకుని, జైళ్లకుపోయి లాటీ దెబ్బలుతిని, నానాబాధలు పడ్డాడు. ఏం మిగి లింది ? ఏం సాధించాడు ? ఏమీలేదు. పైగా మిమ్మల్ని దిక్కులేని పక్షులను చేశాడు.' బహుశా అప్పుడు అమ్మ అక్కడ కన్నీళ్లు పెట్టుకుని నిలబడి వుంది. తానూ అప్పుడు అక్కడే వున్నాడు. పోనీ, చూద్దామంటే, తండ్రి ఫొటో కూడా ఏదీ మంచిది లేదు. ఒక పాత గ్రూప్ ఫొటో—ఆయన కాలేజీలో

చదువుకుంటుండగా తీయించుకున్నది — ఉన్నదికాని అందులో మొత్తం నభైమంది పైగా ఉన్నారు. ఫొటో పట్టనంత కిటకిటలాడుతున్న అంతమంది లోనూ, 'ఇదుగో, వీరే మీ నాన్న...' అని ఒకసారి తల్లి చూపించింది. కాని ఆ బొమ్మ చాలా చిన్నది. తల తప్ప ఏమీ కనిపించలేదు. ఆ కళ్ళమాత్రం చెంపకు చేరెడేసి వున్నాయి. భవిష్యత్తులోకి ఆశగా, అద్భుతంగా చూస్తున్నట్టు ఉన్నాయవి. తనవీ అచ్చం అవే కళ్ళని అమ్మ ఎన్నోసార్లు అన్నది.

గాంధీకి అంతలో అనవసరంగా నవ్వు వచ్చింది. తాను కడుపులో వుండగా తన తండ్రి స్వాతంత్ర్యోద్యమ లో ముమ్మరంగా, నిర్విరామంగా తిరిగాడు. తనకు కూతురు పుడితే 'స్వరాజ్య లక్ష్మి' అనీ; కొడుకు పుడితే 'మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ' అని పేరు పెటా లన్నారు. పెద్దల పేర్లూ, దేవుళ్ల పేర్లూ అసలు వొద్దు పొమ్మన్నాడు. ఇన్నీ అని తాను పుట్టక ముందే పోయాడు.

బయట రణగొణ ధ్వని. కాటుక కొండలవంటి మేఘాల చాటున ఫిరంగులు మ్రోగుతున్నట్టున్నది. ఉరుములు...మెరుపులు...

ఎనిమిది తొమ్మిది నెలల క్రిందట ..తాను అప్పటికే కనిపించిన ప్రకటన లన్నిటికీ అప్లయిచేసి వున్నాడు. మొదటిసారి ఒక చిన్న, కొత్త, కాలేజీకి ఇంటర్వ్యూకు వెళ్లిన ఉదంతం గుర్తుకు వచ్చింది. ఆలస్యంగా వచ్చిన రైల్లో ఆ వూళ్ళ దిగేసరికి వర్షం...సన్నగా ప్రారంభమై అంతలోనే పెద్దదయింది. కాస్సేపు స్టేషన్లో తలదాచుకుని తర్వాత వూళ్ళోవారినీ వీరినీ అడుగుతూ చివరకు పొలాలగట్లవెంట నడిచి కాలేజీకి పోయాడు. బురదలో నడుస్తూవుండగా తాను అనుమానిస్తున్నట్టే చెప్పు తెగింది. శుభ్రంగా తడిసి ముద్దయిపోయి వున్నాడు. చేతిలో సర్టిఫికెట్లు, టెస్టిమోనియల్సుతో నిండిన సంచీ, తెగిన చెప్పు, చప్పగా తడిసి నిలువెల్లా నీళ్లు కారుతూ తాను కాలేజీ చేరుకున్నాడు. కాలేజీ అంటే చుట్టూ తాటాకుల పాకలు...వాటిలో రొద చేస్తూ విద్యార్థులు ..మధ్యలో కొంచెం దిట్టమయిన చిన్న కట్టడం...తాను అక్కడికి చేరుకున్న కొద్ది క్షణాల్లోనే విద్యార్థులందరూ 'పాకలు కురుస్తున్నాయి.. సెలవు కావాలి...' అని ప్రిన్సిపాలు గదిముందు వర్షంలో నిలబడి నినాదాలుచేసి అయిదు నిముషాల్లో సెలవు సంపాదించుకుని ఎటువారటుపోయారు. అంతా సద్దుమణిగిన తర్వాత తాను ప్రిన్సిపాల్‌ను కలుసుకుంటే ఆయన చప్పరించి 'ఆలస్యమైపోయింది...అపాయింట్‌మెంట్ జరిగిపోయింది...' అన్నాడు. తర్వాత తెలిసింది. అది ముందే నిశ్చయమైపోయిన విషయం. కాకపోతే ఇంటర్వ్యూ అనేవి ఒక తప్పనిసరి ప్రహసనం...కేవలం తమాషా...అంతే...

గాంధీ అనవసరంగా దగ్గి చాపమీదికి జారి పడుకున్నాడు. కళ్ళుమూసుకున్నా నిద్రపట్టడంలేదు. మళ్లీ రేపు కోర్టుకు తీసుకుపోతారు. ఇవాళ ఎక్కువ ఏమీ జరగలేదు. రేపు ప్రశ్నలవర్షం కురిపిస్తారు. ఉక్కిరిబిక్కిరి చేస్తారు.

ఆ తర్వాత చాలారోజులు ఏ ఉద్యోగమూ రాలేదు. కనీసం ఇంటర్వ్యూకైనా పిలుపురాలేదు. తన పని మామూలే. నెలకు ఆరు రూపాయలకు అద్దెకు తీసుకున్న చిన్న గదీ, (దానికి రెండునెలల అద్దె బకాయి) గదిలో చాప, పక్కన పాత ట్రంకుపెట్టె. పైనా క్రిందా పుస్తకాలు, పెచ్చులూడిపోయిన గోడకు ఒక పిల్లి బొమ్మ ఉన్న క్యాలెండరూ, ఒక ఐన్‌స్టయిన్ ఫోటో, గ్లాసు, అద్దం...ఇవీ తన సంపద. వారానికి అయిదురోజులే తిండి...రోజుకో యింటిచొప్పున అయిదు ఇళ్లే మిగిలాయి అప్పటికి. సోమవారం, శుక్రవారం తనకు తిండిపెట్టే మంచివాళ్లకు ట్రాన్స్‌ఫరయి ఎటో వెళ్లిపోయారు. రోజూ సాయంకాలం పూట అయిదారుగురు పిల్లలకు ట్యూషన్ చెప్పడం,మిగిలిన కాలమంతా, 'కావలెను'ప్రకటనలుచూస్తూ ప్రతిచోటికీ అప్లయి చేయడం, చదువుతూ వ్రాస్తూ గడపడం, ఏమీ తోచనప్పుడు ఐన్‌స్టయిన్ ఫోటో చేతిలోకి తీసుకుని ఊరికే చూస్తూ కూర్చోడం, ఇంతే...ఆ రోజుల్లో అతడు సాధించిన ఘనకార్యం ఒక్కటే ప్రక్కయిళ్లలో పనిచేసే పదేళ్ల రంగడనే అనాథ బాలుడికి చదవడం వ్రాయడం నేర్పాడు. ఉద్యోగం దిగులెక్కువై పోయింది. ఎక్కడికి పోయినా 'లేదు' అనే మాట తప్ప మరొకటి వినబడలేదు. కొన్ని చోట్ల—

'మాకు న్యూక్లియర్ ఫిజిక్స్ పనికిరాదు బాబూ! మామూలు ఫిజిక్స్ అయితే ఏదో చూసేవాళ్ళం. అయినా రిసెర్చికి పోకపోయావా? స్కాలర్‌షిప్ వచ్చేదిగా?'

'అవకాశం రాలేదండీ...ప్రయత్నించాను.'

'ప్చ్! ఏం లాభం లేదు.'

మరి కొన్నిచోట్ల—

'ఇంత క్వాలిఫికేషన్ మా కెందుకు నాయనా! ఏదో మామూలు స్కూలు...'

ఇతర చోట్ల—

'మాకు మామూలు అక్కౌంట్స్ తెలిసిన గుమాస్తా కావాలి. ఈ సైన్సు లెందుకు?'

'పోనీ... అదే చేస్తానండీ...'

'కుదరదు...నువ్వు చెయ్యలేవు...'

చదువుకున్నన్నాళ్లూ తాను వారాలు చేసుకుని లోకులమీద ఆధారపడ్డాడు. ట్యూషన్లమీద పెద్దగా వచ్చిందేమున్నది? పై ఖర్చులుమాత్రం వెళ్లిపోయేవి. చదువైపోయింది. డిగ్రీ చేతికొచ్చింది. విన్నవారూ చూసిన వారూ ఏమనుకుంటారో అనిపించేది. ఎవరింటికయినా పొద్దున్నేవెళ్లి 'ఇవాళ మీ యింట్లో వారం.! అని చెప్పి రావడానికీ, తిండికి వెళ్లడానికీ సిగ్గుతో క్రుంగిపోయేవాడు.

గాంధీ చలికి ముడుచుకు పడుకున్నాడు. తల్లి కడుపులోవున్న పిల్లవాడిలాగున...అతని తల్లి అంటూ వుండేది. 'మా వాడు నిద్రలో కదలడు. పుస్తకంలాగు పడుకుంటాడు.' అని. అతనికి మాగన్నుగా నిద్రపడుతున్నది. కాని అది సరయిన నిద్రకాదు. కళ్లముందు ఏవేవో చిత్రాలు...దృశ్యాలు.

అతడు గురువారంనాడు భోజనంచేసే యిల్లు... ఆయన ఒక మెడికల్ రిప్రెజెంటెటివ్...చాలా మంచివాడు...బ్రహ్మచారి... వయసులోవున్న వితంతువైన చెల్లెలు. ఆమెకు ఒక పసిపిల్ల...వరండా ప్రక్కన గదిలో వయసు మళ్లిన ముసలి తండ్రి...ఆ నాడు రాత్రి తొమ్మిది గంటలవేళ గాంధీ భోజనానికి వెళ్లాడు. ముసలాయన గదిలో అలికిడి లేదు. బహుశా నిద్రపోతున్నాడేమో, లేకపోతే వూళ్లో లేడో!... మూడేళ్ల పిల్ల హాల్లో సోఫాలో పడుకుని నిద్రపోతున్నది. సోఫా క్రింద నేలమీద ఒక చెయ్యి విరిగిన బొమ్మ...గోడమీద 'టిక్కు టిక్కు' మంటున్న గడియారం...చుట్టూ నిశ్శబ్దం...తలుపు తట్టిన శబ్దం విని ఆమె వచ్చింది 'నీ కోసమే చూస్తున్నానంటూ లోపలికి తీసుకువెళ్లి అన్నంపెట్టింది. ఆ తర్వాత అతడు హాల్లోకి వచ్చాడు. ఆమె వెనకనుంచి 'ఇప్పుడంతదూరం వెళ్లడం దేనికి? ఇక్కడే పడుకో... నాకూ భయంగా వుంది. ఒంటరిగా వున్నాను.' అన్నది. అతడు హాల్లోనే సోఫాలో ఒకపక్కన కూలబడ్డాడు. అంతలోనే అతనికి నిద్రముంచుకు వచ్చింది. ఎంత సేపు నిద్రపోయాడో ఏమో! ఆమె అతని మీదికి వంగి లేపుతూ వుండగా మెలకువ వచ్చింది. ఆమె మెడలోని ఒంటిపేట బంగారు గొలుసు అతని నుదుటికి చల్లగా తగులుతున్నది. ఆమె 'లే...లేచి లోపల పడుకో...' అంటూ పక్కగదిలోకి వెళ్లింది. అతడు లేచాడు. చేతివ్రేళ్లు విరుచుకుని, నుదురు గట్టిగా తుడుచుకుని ఒక్కక్షణం నిలబడి అంతలోనే తలుపు తీసుకుని వరండాదాటి మెట్లుదిగి వీధి తలుపు విసురుగా తోసి వీధిలోకి వచ్చాడు. విసవిస నడవడం ప్రారంభించాడు. ఆమె, వెనకనుంచి 'అదేమిటి? వెళ్లిపోతున్నావా?' అనడం వినిపించింది. కాని అతడు ఆగలేదు. వెనుదిరిగి చూడనైనా లేదు. వెలుగు చీకట్లతో నిండిన వీధిలో గబగబ నడచిపోయాడు.

గాంధీ పక్కకు ఒత్తిగిలిపడుకున్నాడు. అంతలో అతనికి ఎప్పుడో తాను చూసిన కడుపుతోవున్న పెద్ద బల్లి గుర్తుకు వచ్చింది. ఆ వెనువెంటనే వందలాది కాళ్లతో అసహ్యంగా నడిచే కాళ్లజెర్రి గుర్తుకు వచ్చింది. 'దానికీ అన్నికాళ్లెందుకో!' అనిపించింది. ఎక్కడినుంచో మృదువైన వాసన...జైల్లో ఈవాసన ఏమిటి ? ఆనాడు తాను సీసాలో తెచ్చుకున్న పదార్థం వాసన ఇలా మృదువుగా లేదు...చాలా ఘాటుగావుంది.

ఆనాడు ఆగస్టు పదిహేనవతేదీ...దేశమంతటా గొప్ప కోలాహలం ... సంచలనం.. హడావిడి...ప్రబోధాలు...హితోక్తులు.. ప్రసంగాలు...ప్రదర్శనలు...పతాకాలు...అంతా సంతలాగు, సంబరంలాగున్నది. ఆ చిన్నరూములో పగలంతా ఒంటరిగా గాంధీ...రాత్రి పదిగంటలు...చుట్టూ నిశ్శబ్దం...కిటికీలో లాంతరు మందంగా వెలుగుతున్నది..బహుశా ఆనాటితో అందులో కిరసనాయిలు అయిపోతుంది ... ట్రంకుపెట్టెమీద ఫొటోలో ఐన్‌స్టయిన్ కళ్లు, నిశితమైన చురుకైన కళ్లు, తీవ్రంగా చూస్తున్నాయి. గోడమీది క్యాలెండరులో పిల్లి— ఏ క్షణంలోనైనా ఈలవేస్తే చాలు, లేచి రావచ్చునన్నంత సహజంగా వుంటుంది—మూతి ముడుచుకుని వెలిగేకళ్లతో చూస్తున్నది. చాప పక్కన మూలగా ఆ చిన్నసీసా...అతడు లావాటి పుస్తకం తీశాడు..దానిలో పేపర్ కటింగ్స్ చాలా ఉన్నాయి.

హాల్డేన్, నర్లీకర్, ఘోరానాల ప్రసంగాలు, బొమ్మలు, ఇంకేవేవో వైజ్ఞానిక వ్యాసాలు, భాభాఫోటో ఒకటి, చంద్రమండలంమీద మానవుడు పాదం పెడుతున్న రంగుల దృశ్యం; తన క్లాస్‌మేట్ ఒక అమ్మాయి (ఆమె నతడు ప్రేమించాడా ?) ఎప్పుడో పంపిన గ్రీటింగ్ కార్డు వెనక వెన్నెలలో తాజ్ మహల్ సుందర దృశ్యం; తాను వ్రాసిన ఏవేవో వ్యాసాల కట్టలు; సైన్సులో నోబెల్ బహుమతి పొందినవారి వివరాలు; ఒక యువ సైంటిస్టు, నిరాశా నిస్పృహలతో ఆత్మ హత్య చేసుకుంటూ వ్రాసిన విషాదకరమైన చివరి ఉత్తరం; ఇన్నింటినీ ఒక్కసారి తిరగవేశాడు. తర్వాత ఒక కాగితం చేతిలోకి తీసుకున్నాడు. కలంలో సిరా అయిపోయిందో ఏమో విదిలిస్తేకాని వ్రాయలేదు. అప్పుడు తనకు మనస్థిమితం ఉన్నదా? ఉన్నదనే అనుకున్నాడు. కళ్లవెంట మాటిమాటికీ నీళ్లు ఉబుకు తున్నాయి. వొణుకుతున్న చేత్తో కాసిని వాక్యాలు వ్రాశాడు. చివర సంతకం పెట్టబోతే సిరా అయిపో యిందేమో, పూర్తిగా వీలుపడలేదు. చివరి అక్షరం తేలిపోయింది. తేదీ వెయ్యలేదు. ఆ తర్వాత చాలాసేపు కదలకుండా కూర్చుని వొణుకుతున్న చేతులతో ఆ సీసా తీసుకుని దానివంక కాస్సేపు కన్నార్పకుండా చూశాడు. మనసంతా మొద్దుబారిపోయింది. ఏ అనుభూతీ ఆలోచనాలేని అవస్థ...గ్లాని...చేతులు వొణుకుతున్నా పని పూర్తిచేసుకున్నాడు. తర్వాత చాపమీద వెల్లకిలా పడుకున్నాడు. కొద్ది క్షణాలే...బహుశా నిముషంకూడా అయివుండదు. మెదడులో ముందు, కేవలం యెర్ర తామరపూలతో నిండిన చెరువు...తర్వాత అంకెలూ, అక్షరాలూ, ఏవేవో ఈక్వేషన్లూ తిరిగిపోయాయి... ఏదో అజ్ఞాతలోకంలోకి వేగంగా ప్రయాణం చేస్తున్న అనుభూతి...తర్వాత భారరహితస్థితి ... రెక్కలువచ్చి మబ్బులుదాటి కాంతివేగంతో వెళ్లిపోతున్నట్టు ... 'అన్నట్టు కాంతివేగం సరిగ్గా ఎంతో' అన్నభావన ... సరిగ్గా ఆ క్షణంలో రంగడు మెరుపులాగా వచ్చాడు. ఎందుకు వచ్చాడో తెలియదు. ఆగస్టు పదిహేను హడావిడి అంతా వాడిమొహంలోనే ఉన్నట్టున్నది. గుండెమీద చిన్నజెండా పెట్టుకుని వున్నాడు. వాడు గాంధీని పిలిచి, అతడు బదులు పలక్కపోయేసరికి పెద్దగా అరిచి కేకలుపెట్టాడు. అంతలో హడావిడిగా అందరూ వచ్చారు. గుంపుగా వచ్చారు. తర్వాత అతన్ని అపస్మారకస్థితిలో ఆస్పత్రికి తీసుకుపోయారు.

అక్కడ డాక్టర్లు అతని పొట్టలోని విదేశీ పదార్థాన్ని విజయవంతంగా ఇవతలికితీసి అతన్ని బ్రతికించారు. తర్వాత రెండుమూడు రోజులే ఆస్పత్రిలో వుంచారు. ఈ మధ్యలో పోలీసులు హడావిడి చేశారు. అతని రూము అంతా గాలించారు. అవసరమైనవీ, అనవసర మైనవీ అన్నీ తీసుకున్నారు. 'ఆస్పత్రిలో ఇంక ఉండ నక్కరలేదు. వెళ్లిపొమ్మ'ని డాక్టర్లు సాగనంపేసరికి సిద్ధంగా ఉన్నారు పోలీసులు...

కోర్టులో విచారణ... కొండరాళ్లతో కట్టబడిన పాతకాలపు కట్టడం... విశాలమైన హాలు...ఎదురుగా జడ్జి... నల్లకోట్లు ధరించిన న్యాయవాదులు...తల లకు పాగాలతో వరండాలలోనూ, లోపలా ప్లీడరు గుమాస్తాలు, బిళ్లబంట్రోతులు ...జడ్జిగారి పైన గోడమీద పెద్దసైజు జాతిపిత, ప్రధాని, రాష్ట్ర పతుల రంగుల ఫొటోలు...

న్యాయమూర్తి నడివయసువాడే ... మూర్తీ భవించిన మంచితనంలా వున్నాడు. అవసరం వస్తే కరుడు కట్టిన కాఠిన్యంలాగానూ ఉండగలవాడిలా కని పిస్తాడు. గాంధీని మధ్యాహ్నం వేళకు లోపలికి తీసుకు పోయి బోనెక్కించారు. ఒక న్యాయవాది—దళసరి కళ్లద్దాలు ధరించినవాడు—విషయం అంతా పెద్ద గొంతుతో నివేదించాడు. న్యాయమూర్తి ప్రసన్నంగా గాంధీవంక చూస్తూ బుగ్గన చెయ్యి ఆనించుకుని విన్నాడు. కొందరు న్యాయవాదులు కూడా ఉత్కం ఠతో విన్నారు. పోలీసులు గుమ్మం దగ్గర నిలబడి వున్నారు. వెనక బల్లలమీద కొందరు కూర్చున్నారు. వారు కూడా విన్నారు. గాంధీ అంతసేపూ నుదురు చేత్తో రుద్దుకుంటూనూ, లాల్చీజేబుల్లో చేతులుంచి మళ్లా బయటికి తీస్తూనూ, నిలబడిపోయాడు. అంతలో అతనిచేత 'నిజమే చెబుతాన'ని ప్రమాణం చేయించి ప్రశ్నలు ప్రారంభించాడు. అతని రూములో పోలీసులు లోబరుచుకున్న కాయితాలలో అతని స్కూల్‌ఫైనల్ రిజిస్టరు మొదటి పేజీ కాపీ వుంది.

పేరు–మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, ముప్పి.

పుట్టిన తేదీ–ఆగస్టు మొదటితేదీ పందొమ్మిది వందల నలభైఏడు.

పుట్టుమచ్చలు—ఎడమ మోచేతిపైన పెద్ద పుట్టుమచ్చ ఒకటి, కుడిభుజానపైన చిన్న పుట్టు మచ్చ మరొకటి.

నడవడి—సంతృప్తికరం.

గాంధీ నిశ్చలంగా వింటున్నాడు. అతనికి అంతలో ఎప్పుడో తాను నీళ్లలో చూసిన శవం గుర్తుకు వచ్చింది. అది నీళ్లలో నాని బాగా ఉబ్బిపోయివుంది. బోర్లా పడుకుని నీళ్లలో తేలుతూ లాకులదగ్గర ఆగి పోయింది. 'అది తనకు ఎందుకు గుర్తువచ్చిందా' అని ఆలోచించాడు. ఆ ఆలోచన తెగలేదు. అంతలో అతన్ని పరధ్యానంగా ఉన్నందుకు మందలించి ప్రశ్నలు మొదలు పెట్టారు.

గాంధీ కంఠం వొణుకుతూవుండగా చెప్పాడు.

'అవును. ఆత్మహత్య ఘోరమైన నేరమే.' అతని కళ్లలో నీళ్లు నిలిచాయి.

'అయినా గత్యంతరం లేకపోయింది. అయిన వాళ్లెవరూ లేరు. చిన్నప్పటినుంచీ శ్రద్ధగా చదువు కున్నాను. వారాలు చేసుకుని, వీధిలాంతర్ల క్రింద చదువుకున్నాను. ట్యూషన్లు చెప్పుకున్నాను. చదువై పోయిన తర్వాత రిసెర్చి స్కాలర్‌షిప్ వస్తుందికదా అని ఆశ పడ్డాను కాని రాలేదు. ఎన్నో ఉద్యోగాలకు అప్లయి చేశాను...' అతడు ఆగి వొణుకుతున్న వ్రేళ్లతో కనుతుదలు తుడుచుకుని కళ్లజోడు పెట్టుకుని మళ్లీ అన్నాడు.

'ఏదీ రాలేదు. ఎంతకాలం ఇట్లా? ఇట్లా బ్రతకలేననిపించింది. అంతే...'

జడ్జి కళ్లజోడు తీసి ఎదురుగా బల్లమీద పెట్టి నుదురు తుడుచుకుని కాస్సేపు కళ్లు మూసు కున్నాడు. కొద్ది క్షణాలు కోర్టుహాల్లో నిశ్శబ్దం వ్యాపిం చింది. జడ్జి అంతలో గడియారం చూసుకుని కళ్ల జోడు అందుకుని చివాలున లేచి లోపలికి వెళ్లి పోయాడు. మరునాటికి వాయిదా వేశాడు.

గాంధీకి నిద్ర పట్టింది. కాని కలవరిస్తూనే వున్నాడు. ఏవో అస్పష్టమైన మాటలు.

అప్పలస్వామి అర్ధరాత్రివేళ వచ్చి కటకటాల పక్కన నిలబడి బీడీ ముట్టించుకుని, ఆ అగ్గిపుల్ల వెలుతురులో లోపల నిద్రపోతున్న గాంధీవంకచూసి తనలో తను నెమ్మదిగా నవ్వుకుని బీడీ దమ్ము పీలుస్తూ చాలాసేపు అక్కడే నిలబడ్డాడు. తర్వాత బూట్లు చప్పుడు కాకుండా నెమ్మదిగా నడిచి వెళ్లి పోయాడు.

గాంధీకి మెలకువ వచ్చేసరికి బాగా పొద్దె క్కింది. అతని కళ్లు ఎర్రగా జ్యోతుల్లాగా ఉన్నాయి. కణతలమీద నరాలు ఉబ్బి ఉన్నాయి. నిద్రలో వర సగా కలలు వచ్చాయి. ఒక కలలో అంకెలు...అన్నీ అంకెలే...అల్లి బిల్లి తిరుగుతూ అద్భుతంగా కని పించాయి. మరో కలలో లెక్కలేనన్ని పాములు .. వందలూ వేలూ—తర్వాతి కలలో అసంఖ్యాకమైన సౌరకుటుంబాలూ, తారా సందోహాలూ, గ్రహాలూ, గ్రహశకలాలూ, తోక చుక్కలూ, పరమాణు ప్రయో గాలూ కనిపించాయి.

అప్పలస్వామి తలుపు తీయగానే గాంధీ 'ఏవీ కాయితాలు? కలం ఏదీ?' అని అడిగాడు. అప్పల స్వామి ఏమీ మాట్లాడలేదు.

గాంధీకూడా మళ్లీ ఏమీ అడగలేదు. బయటికి వచ్చిచూస్తే పలుచని ఎండ మృదువుగా మెత్తగా అతని మొహానికి తగిలింది. ఆవరణలో కాస్సేపు అటూ యిటూ తిరిగి కాపలా వాడిని పిలిచి, ఆ ప్రహరీ గోడను చూపిస్తూ 'ఆ గోడ అవతల ఏముంది?' అని అడిగాడు.

కాపలావాడు కళ్లు పెద్దవిచేసి చూసి 'ఏమీ లేదు' అన్నాడు.

'ఏమీ లేదూ?' అని గొణుక్కున్నాడు గాంధీ. 'అవును. ఏమీ ఉండి ఉండదు. అడివేమో అది అంతా' అన్నాడు మళ్లీ.

వ్యానులో కోర్టుకు తీసుకు పోతూండగా అప్పలస్వామి అతన్ని నిశితంగా చూశాడు. అతని కణతలమీద నరాలు ఉబ్బి ఉన్నాయి. కళ్లు ఎర్రగా ఉన్నాయి. కళ్లజోడు తీసి జేబులో ఉంచుకుని మాటిమాటికీ కళ్లు నులుముకుంటూ కూర్చుని వున్నాడు చూపులు ఎక్కడా నిలవడం లేదు.

కోర్టు హాల్లోకి పిలిచి బోనెక్కించగానే ఉన్నట్టుండి పెద్దగా 'నా రూములో ఫోటో ఉండాలి... ఐన్‌స్టయిన్ ఫోటో...అదిముందు నా కిప్పించండి' అన్నాడు.

ఎవరూ పట్టించుకున్నట్టు కనిపించలేదు. కోపంతో కళ్లు ఎర్రబడ్డాయి. వొణుకుతున్న కంఠంతో మళ్లీ 'దాన్ని తీసుకురండి...ఆ పైన గోడకు తగి లిదాం...ఇక్కడ ఉండాలి అది...లేకపోతే నేనూరు కోను...' అన్నాడు.

న్యాయవాది వరసగా ప్రశ్నలు వేశాడు. గాంధీ సమాధానాలు చెప్పకుండా నిలబడిపోయాడు. రెండు చేతులతో లాల్చీ గట్టిదనాన్ని పరీక్షించాడు. అది అంతలో ఫర్రున చినిగింది. అతడు తలఎత్తి 'చూశారా? ఇలా అనేసరికి చినిగిపోయింది...' అన్నాడు.

పోలీసు అధికారీ, పోలీసులూ, అప్పలస్వామి, న్యాయవాదులూ, వెనక కూర్చున్నవారూ, న్యాయమూర్తీ అందరూ కళ్లు పెద్దవి చేసుకుని చూస్తున్నారూ—అంతలో గాంధీ 'ఎంతసేపూ మీరడగడమూ నేను చెప్పడమూ కుదరదు. నేను చెప్పవలసిందంతా నిన్ననే చెప్పాను... అవును... చచ్చిపోదామనుకున్నానూ ఇప్పుడు నేనడుగుతాను...తెలిస్తే చెప్పండి...! అని ఒక్క క్షణం ఆలోచించి 'ఆఁ! కాళ్లజెర్రి తెలుసుగా? దానికి అన్ని కాళ్లెందుకో చెప్పండి...చూద్దాం...' అన్నాడు మళ్లీ' చెప్పలేరు...నాకు తెలుసు...పోనీ 'ఈ ఈజ్ ఈక్వల్ టు ఎం సి స్క్వయిర్'అంటే ఏమిటి?' అని అడిగాడు. తర్వాత ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు. అతని చూపు లెక్కడో ఉన్నాయి.

న్యాయమూర్తి చివాలున లేచి లోపలికి వెళ్లిపోయాడు. అంతలో గాంధీ ముందు మెరుపు మెరిసినట్టయింది. ఎవరో కెమెరా 'క్లిక్' మనిపించారు. గాంధీ పెద్దగా అరిచాడు .:. 'ఎవర్రా అది... పట్టుకోండి...' తర్వాత తనలోనాను గొణుక్కుంటూ నిలబడిపోయాడు. కొద్దినిముషాలతర్వాత పోలీసు అధికారి అతన్ని సమీపించి 'రండి వెళదాం' అన్నాడు. గాంధీ వాక్ప్రవాహం ఆపి 'ఎక్కడికి?'అని అడిగాడు.

'ఇంటికిపోదాం' అన్నాడాయన.

'నాకు యిల్లులేదు. వాకిలీలేదు...' అన్నాడు గాంధీ.

'మీ యిష్టంవచ్చిచోటికి తీసుకుపోతాను. రండి' అన్నాడు ఆయన మళ్లీ.

'అయితే పదండి ... రామలీలామైదానంలో మీటింగు ఉంది. అక్కడ మాట్లాడుతాను ఇవ్వాళ... ఆ తర్వాత గేట్ వే ఆఫ్ ఇండియాకు పోదాం...'

'సరే...అక్కడికేపోదాం...' అన్నాడు పోలీసు అధికారి అతని చెయ్యిపట్టుకుని.

'రైటో ... కాని అక్కడ ఫిరంగులూ అవీ ప్రేల్చగూడదని చెప్పండి ... అవి నాకు గిట్టవు... అన్నట్టు నాకు కాయితాలూ, కలమూ కావాలి... ముందు అవి తెప్పించండి...'

వ్యాను రోడ్డుమీద నడుస్తూ వుండగా రోడ్డుమీద ఏదో ప్రజాప్రదర్శన ... అంతటా అలజడిగా, కోలాహలంగా ఉంది.

గాంధీ రహస్యం చెబుతున్నట్టు 'అన్నట్టు మీకు రోజూవారీ వాడకానికి ఆటంబాంబులు కావాలి కదా? ఎట్లా మేనేజ్ చేస్తున్నారు? మీక్కావాలంటే చెప్పండి... రెండురోజుల్లో చేసియిస్తాను. కావలసిందల్లా కాయితాలూ—కలమూ—అంతే...' అంటూ వెర్రినవ్వు నవ్వాడు.

అప్పలస్వామి పోలీసు అధికారిని నెమ్మదిగా ప్రశ్నించాడు. 'సార్! ఏమిటి సంగతి?'

పోలీసు అధికారి కణతమీద బొటనవ్రేలుంచుకుని నవ్వి నెమ్మదిగా మతిచెడింది ... ఇక పిచ్చాసుపత్రే శరణ్యం...' అన్నాడు.

జైలుకు వెళ్లగానే అతనికి కాసిని కాగితాలూ, కలమూ ఇచ్చారు. గాంధీ వాటిని ఆశగా ఆదుర్దాగా అందుకుని వెంటనే చాపమీద కూలబడి వ్రాయడం ప్రారంభించాడు. అప్పలస్వామి దగ్గరగా నిలబడి చూశాడు. ఏవేవో వ్రాసి గాంధీ అయిదునిముషాల తర్వాత అలిసిపోయాడు. తర్వాత కాస్సేపు ఆలోచించి ముందు ఒక సున్నా గీచాడు ... అది తల...తర్వాత రెండు గీతలు గీచాడు ... అవి చేతులు...మళ్లీ చాలా గీతలు— అవి తొడలు...వాళ్ళ...తర్వాత వక్షస్థలాన్ని సూచిస్తూ రెండు పెద్ద సున్నాలు గీచాడు ... అంతే...ఇక ఇతర వివరాలేవీ, కన్ను ముక్కు వగైరా లేవీ లేవు. బొమ్మవేసి అప్పలస్వామివంకచూసి నవ్వి 'పేరు పెడతాను చూడు...' అంటూ కొద్దిక్షణాలు ఆలోచించి ఆ బొమ్మ క్రింద పెద్ద అక్షరాలతో 'కాళ్లజెర్రి' అని వ్రాశాడు ... తర్వాత నిద్రవచ్చింది కాబోలు, చాపమీద బోర్లాపడుకుని గురకపెడుతూ నిద్రపోయాడు.

---

# సంఘాభ్యుదయ పథంలో గ్రంథాలయాల పాత్ర

శ్రీ ముదివేడు ప్రభాకర రావు

## ప్రస్తావన :

జనసముదాయమే సంఘం. ప్రజలు భవితవ్యాన్ని సర్వ సామాన్య దృష్టితో చూస్తారు. ప్రపంచ సంఘాన్ని (World Society) ఆర్థికంగా నాల్గు భాగాలుగా విభజింపవచ్చు. 1) అభివృద్ధి రహిత దేశాలు (undeveloped Countries) 2) నిమ్నాభివృద్ధి గల దేశాలు (Under-developed Countries), 3) పాక్షిక పురోగాములైన దేశాలు (Semi-advanced Countries) 4) పురోగమించిన దేశాలు (Advanced Conntries.)

అభివృద్ధి సాధించే దేశమంటే నిమ్నాభివృద్ధి గల దేశం. ఇలాంటి దేశాల్లో ఆర్థిక విస్తృతికోసం ఎక్కువ ధనం శక్తికిమించి ఖర్చుచేయబడుతోంది. మనదేశం నేడట్టి అభ్యుదయపథంలో పయనిస్తోంది.

## కొన్నిపదాల అర్థ విస్తృతి—నిర్వచనం

ప్రణాళిక (Planning) అనే పదం ప్రారంభ దశలో ఆర్థిక ప్రణాళిక (Economic Planning) అనే అర్థాన్నే యిచ్చేది. కానీ యీనాడిది విస్తృతార్థాన్ని బోధిస్తోంది.అదే విధంగా అభివృద్ధి (Progress) అనేపదం నేడు పెరుగుదల (Development) అనే అర్థాన్నేకాక మార్పు (Change) అనే అర్థాన్ని కూడ సూచిస్తోంది.

మార్పంటే ఏమిటి? మార్పు సాంఘికంగానూ, సాంస్కృతికంగాను పైగా గుణ, పరిమాణ సంబంధి (Qualitative and Quantitative Relation) యైన ఆర్థికమైన మార్పునూ సూచింపవచ్చు. అసలు దేన్ని మనం 'మార్పు' (Change) అంటాము? ఒక నిర్దిష్ట మార్గానికి లగించిన క్రమ పరిణామమే మార్పు. ఈ మార్గం సంఘంయొక్క సాంస్కృతిక ధ్యేయం వైపుకు దారితీస్తుంది. ఆ ధ్యేయం భారతీయ మతానుసారం నిత్యమో, అనిత్యమో కావచ్చు కాకుంటే వ్యక్తి స్వాతంత్ర్యమో, సంపూర్ణాధికార కేంద్రీకరణమో కావచ్చు. కాబట్టి ఆ ధ్యేయం చేరడానికొక ప్రణాళికా, తదాచరణానికి పూర్వమే దాన్ని నిర్దుష్టంగా నిర్వచించాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. రాజకీయ వ్యవస్థ యేదైనా సంఘంలోని సర్వసభ్యుల యొక్క క్షేమం సర్వత్ర అంగీకరింపబడిన ఆశయం. ఈ ఆశయాన్ని సాధించడాన్కి ప్రణాళికా రచనా ప్రాముఖ్యం మనకు తెలియంది కాదు.

శ్రేయస్సు (Welfare)అంటూనే మనం ప్రముఖంగా ఆర్థిక శ్రేయస్సు (Economic welfare) దృష్ట్యైనే ప్రసంగిస్తాం. ఈ నాడు ప్రపంచంలో రెండు ప్రముఖవర్గాలున్నాయి. అభ్యుదయ పథగామియైన దేశాలనుపశ్చిమవర్గంవారో లేకుంటే కమ్యూనిస్టువర్గంవారో ఎల్లప్పుడూ తమవైపు ఆకర్షించుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. ఏదో ఒక వర్గంలో ఏకీభవించటమంటే పరాధీనత్వానికి పాల్పడటమే! కాబట్టి, ప్రతి దేశం తనదైన ధ్యేయాలనూ, తత్ప్రాప్తికై ఒక విశిష్ట పథకాన్ని తప్పని సరిగా గలిగి ఉండాలి.

## భారతదేశం—సంఘం

సంఘప్రజల జీవితంలోని అనేకాంశాలు మారుతున్న ప్రపంచ పద్ధతులతో పొందికను సాధించారు. మనదేశం ఇప్పటి పరిస్థితుల్లో నిలదొక్కుకోవాలంటే దేశప్రజలు ప్రస్తుతావసరాన్ని గుర్తించి తదనుసారం ప్రవర్తింపవలసి ఉంటుంది. భారతదేశం యొక్క ప్రస్తుతావసరాలేమి? పురోభివృద్ధిగాంచిన దేశాల అభిలాషలు ఇంక చాలాకాలం చెల్లనేరవు.

భారతదేశానికి గ్రామాలే వెన్నెముక. పల్లెల్లో నివసించే సామాన్యజనులు—వాళ్ల పరిజ్ఞానం బహు సంకీర్ణంగా ఉంటుంది. వారికి తమ చుట్టుప్రక్కల ఈ విశాలసంఘంలో జరిగే విషయాలు అగమ్యగోచరంగా ఉంటాయి. ముఖ్యంగా వివిధ ప్రాంతాల్లో జరిగే రాజకీయ, ఆర్థిక, సాంకేతికమైన మార్పులు, ఆ మార్పుల లోని తీవ్రత, వాటి అస్పష్ట పరిస్థితి, వాటి పరిణామం తమపై ఎంత ప్రభావాన్ని చూపుతున్నాయో తెలుసుకోలేని స్థితిలో ఉన్నారు. భిన్నమైన పరిస్థితుల్లో వారి వ్యక్తిత్వం సాంఘికంగా మలచబడినా నిష్ప్రయోజకమౌతుంది. ఈ రెండు పరిస్థితుల్లోని అనుభవాలు పరస్పర విరుద్ధమైనవి.

నవనాగరికత సంఘక్షేత్రంలోని అడుగు పొరల్లో సైతం వేళ్లు తన్నుకొన్నది. నేడు కుగ్రామాల్లోను, చిన్న పట్టణాల్లోను ఉండే ప్రజలు తమ చుట్టుప్రక్కల జరిగే తీవ్రమైన మార్పుల తాకిడికి తట్టుకోలేక వాటితో రాజీపడలేకపోతున్నారు. తగుమాత్రం జాగ్రత్తలు లేనిదే ఓ పెద్ద లక్షాధికారి బస్సులో ప్రయాణం చేయడానికి నిరాకరిస్తున్నాడు. ఒక సామాన్యుని ప్రక్క సద్భావంతో కూర్చోవడానికి సిగ్గుపడుతున్నాడు.

## ఆధునిక ప్రపంచ సంఘం

నేటి ప్రపంచం ప్రముఖంగా సాంకేతీకీకరణం (Industrialisation) వైపు మొగ్గివుంది. ఒకవేళ మనం ప్రపంచ ప్రవాహాని కెదురీదితే ఫలితం— అందరికీ తెలిసిందే! కాబట్టి సంఘం గాలివాటుగా పయనించడం నేర్చుకోవాలి! వ్యక్త ప్రపంచమంతా కేవలం భ్రాంతి, మాయ అనీ, దాన్ని గూర్చిన ఆలోచన అనవసరమనే వాదాని కిచట ప్రసక్తి లేదు. ఇది లౌకికవిషయం— కావటం దానికి కారణం.

అభివృద్ధి (Progress) అనేదాన్ని ఎదుగూ బొదుగూ లేనట్టి ప్రకృతి సిద్ధమైన ముడిసరుకులు గానీ, భౌతికమైన పెట్టుబడిగానీ సాధించలేవు. మానవుడే ఈ రెంటిమధ్యా సేతువై, ఉత్ప్రేరకుడై నిల్చి పై ముడిద్రవ్యాలతో అధికోత్పత్తిని సాధించ గలడు. జనసామాన్యాభివృద్ధిలో ఆతని నిర్మాణపథకం యొక్క పాత్ర అతిముఖ్యమైనది. అభిలషించిన ఫలితాల్ని యంత్రమూలకంగా పొందటానికి మానవుని మేధాశక్తి అంతా నేడు వెచ్చింపబడుతోంది.

సాంకేతీకీకరణమంటే బహుసూక్ష్మాంశాల యొక్క స్వాధీనత, దాని కార్యకారణ సంబంధ పరంపరా పరిజ్ఞానం, (Chain of cause and effect series know how) తద్గుణా పాటవం — వీటి సమాహార స్వరూపం. న్యాయస్థానాల్లోను, ఉన్నత నిర్వహణాధికారం గల పరిపాలనా సంస్థల్లోను సాంకేతికమైన యిక్కట్లు ఎన్నో ఉంటాయి. ఓ స్వార్థ వర్తకుడు ఎలాంటి ఆఫీసులోనైనా లంచం ద్వారా తన పనిని నిమిషాలమీద చక్కబెట్టుకొంటున్నాడు. ఆ వ్యక్తి సత్ఫలితాల్ని పొందటానికి తన ధ్యేయాన్ని ఫలోన్ముఖంగా త్రిప్పటంలో నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నాడు. కావున ఇదీ ఓ సాంకేతిక విద్యయే సుమా! సాంకేతిక విజ్ఞానమంటే కార్యకారణ సంబంధ పరంపరా స్వాధీనతను హేతుబద్ధంగా (rational) సాధించి నిరూపించేదని అర్థం. ఈ లంచగొండితనం (Bribing, Corruption) యొక్క స్వరూప స్వభావాల్ని సహేతుకంగా నిరూపించటం కష్టం. అయినప్పటికీ దాన్ని మనం సాంకేతిక విద్యగా పరిగణించలేం. ఆ మార్గంలో నేడు సంఘంలో ఎక్కువ కార్యాలు సాధికృతాలైనా దాన్ని మనం విజ్ఞానం క్రింద జమ కట్టలేం.

సంఘం పురోభివృద్ధి చెందేకొలదీ ప్రజలు పరిశోధక బుద్ధితోకూడిన జిజ్ఞాసనూ తత్పరత్వాన్నీ పొంది సాంకేతిక పరిజ్ఞానాన్ని విస్తృతంగా కల్గి ఉంటారు. ఎంతగా ఈ పరిజ్ఞానం పెరుగుతుందో అంతగా విజ్ఞానక్షేత్రం విస్తృతిని సంతరించు కొంటుంది. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ కీర్తిశేషు లవటానికి కొద్దిరోజులముందు ఇలా అన్నారు. "India has entered the Industrial and technological cycle" ఈ ప్రోత్సాహనం యొక్క ముఖ్యాశయమేమిటి? ఆయన ప్రముఖంగా సాంకేతిక విజ్ఞానదృష్ట్యా మాటాడాడు. అది ఏకబిందు స్వాధీనతామూలకమైన కార్యకారణ సంబంధ (Single-point control of cause and effect series) ప్రపంచపౌరుడు ద్వికేంద్ర బిందుమూలకమైన సమత్వాన్ని, తత్ఫలనాన్ని ఏకకాలంలోనే స్వాధీన పరచుకొని పురోగమిస్తున్నాడు. మనదేశంలో కూడా దాని కావశ్యకమైన 'వాతావరణం - సాధన సామగ్రులు' వెన్వెంటనే కార్యరూపం ధరించాలి.

## విద్యా విధానంలో అసంబద్ధత :

బోధన కళకన్నా విద్యాసముపార్జనా విధానం ప్రధానమైనది. భారతదేశం వేల సంఖ్యలో పట్ట భద్రుల్ని తయారుచేసి అరబ్, ఆఫ్రికా దేశాలకు ఎగుమతి చేస్తూందిగాని మౌలికమైన విద్యా పొండిత్యాలు (Original scholars)గల వారిని తయారు చేయలేకున్నది. డా॥ ఎస్. ఆర్. రంగనాథన్ వంటి మేధావులు తమ స్వయంకృషితో అంతర్జాతీయ ఖ్యాతి నార్జించినవారు. ఇట్టి విద్యావేత్తలను వేళ్లమీద లెక్కపెట్టవచ్చు.

ఈ నాడు మెట్రికులేషన్ చదివిన ఓ గ్రామస్థుడు తాను సర్వజ్ఞుణ్ణనీ, ఇక చదివి తెలుసుకోవలసిందేమీలేదని విఱ్ఱవీగుతున్నాడు. ఓ పట్టభద్రుడైన పట్టణవాసీ పై విధంగానే తలపోస్తున్నాడు. సరికదా ఒక పి.హెచ్.డి. పట్టాన్ని పొందిన విశ్వవిద్యాలయోద్యోగి సైతం పై విధంగా తలపోయటంలో ఆ గ్రామీణుడికేమాత్రం తీసిపోవడం లేదు. ఇది భారతీయ విద్యావిధానంలోని లోపమా? లేక చదువరుల మనస్తత్వంలోని లోపమా? లేక సాంఘిక వ్యవస్థ లోపమా?

విద్యాబోధన విషయ ప్రణాళిక నిర్మించువారు ఎంత గొప్పవారైనను అది ఏ దేశమైనను, ఏ కాలమైనను ఎట్టివారు సూక్ష్మదృష్టితో ఆగామి సంఘటనములను దాని ననుసరించి చుట్టుప్రక్కల గలిగే మార్పులను నిర్దుష్టముగా బేరీజు వేయలేరు. పద్నాలుగు, పదహైదు సంవత్సరాలు ఉన్నత పాఠశాలలో చదువుకొన్న వ్యక్తిని బాధ్యతాయుత పౌరునిగా, ప్రణాళిక తయారు చేయలేక పోతున్నది. ఈనాటి అవ్యవస్థితమైన విద్యా విధానము ఇతర మేధావంతులకు ప్రవేశము లేకపోయినచో అది ఔత్సుక్యమును తీవ్రతరం చేయటంలో ఆశించిన ఫల మివ్వజాలదు. సాంకేతిక విద్య నభ్యసించేవారు చూపే ఉత్సాహాశయాలను, ఆత్మవిశ్వాసాన్ని, భవితవ్యాన్ని గూర్చిన నిర్భీకతను ఇతర కళావిషయాల నభ్యసించేవారికంటె ఎక్కువగా కల్గి ఉంటారనే సంగతి కళాశాలల్లో ఉండేవారికంతా తెలిసిందే!

ఇలాంటి పాక్షికాభివృద్ధి వల్ల ప్రయోజన మేలాంటిదీ లేదు. మానవుడి శక్తి సామర్థ్యాలన్నీ విద్యావిషయంలో తప్పనిసరిగా పునర్వ్యవస్థీకరింపబడాలి. సంఘం అన్నివైపులా సమానాభివృద్ధి సాధించాలంటే విద్యా విషయాన్ని తక్షణ కర్తవ్యంగా గుర్తించి చేపట్టాలి. ఈ నాడు మనదేశంలో యాంత్రిక ఆర్థిక అసమానత్వాన్ని (Industrial and Economic imbalance) స్పష్టంగా చూస్తున్నాం. సంఘం హెచ్చుతగ్గులు లేకుండ సామరస్యంతో అభివృద్ధి పొందకపోతే దేశాభ్యుదయం అనైక్యతా రుగ్మతచే ముక్కలై పోతుంది. వెనుకబడిన సంఘాలు దీర్ఘకాలంలో అంతర్యుద్ధాలకు గురియై శిథిలమై పోతుంది. మరల బెనారస్, లక్నోలలో మదిరిగా తదితర ప్రాంతాలలోను వ్యక్తిగతాపరాధాలు తల లెత్తుతాయి.

ఈనాడు భవిష్యద్దృష్టి ఉండే మేధావంతులంతా అమెరికా, రష్యాలకు వెళ్లిపోతున్నారు. దాంతో దేశంలో మేధాశక్తికి కొఱత (Brain Drain) ఏర్పడుతోంది. బొంబాయి నగరం ఒక్కటే దేశం మొత్తంమీద 35% ఆదాయపు పన్ను (Income Tax) ను ప్రభుత్వానికి చెల్లిస్తూంది. ఈ తారతమ్యాన్ని ముఖ్యంగా గుర్తించాలి. అసమానత్వం అసహనాన్ని జనింపజేస్తుంది. అది ఒకే స్థలంలో కేంద్రీకృతమై హఠాత్తుగా ఏదో ఒకచోట బ్రద్దలౌతుంది. ఇట్టి విప్లవ ధోరణుల్ని నేడు మనం చాల చోట్ల చూస్తూనే ఉన్నాం.

## సాంఘిక వ్యవస్థలో మార్పులు :

ఆర్థిక, విద్యా, అంతస్థు, పుట్టుక, వంశం, సంప్రాప్తి ఇత్యాదిగా భేదాలను పురస్కరించుకొని పలు విధాలైన ప్రజలను కొన్ని వర్గాలకింద విభజింపవచ్చు. నిన్న మొన్నటిదాకా సాంఘిక వ్యవస్థలో కొన్ని ఉచ్చ వర్గాలవారికే ఆలోచించడానికి నిర్ణయించడానికి అధికారం నియమితమై ఇతర వర్గాలవారు నిషేధింపబడి మూకీభావాన్ని వహించియుండేవారు.

పాశ్చాత్యులు రాక పూర్వం భారతదేశంలోను ప్రపంచంలోని ఇతర దేశాల్లోను సర్వాధికారాలకు మేధావులు, కళాకారులుండే రాజుగారి కొలువుకూటమే కేంద్రంగా ఉండేది. కాని కాలక్రమేణ సంఘంలో ఏ వర్గం అనాదరింపబడిందో అది ఆందోళితమై ఉత్సహించింది. తత్ఫలితంగా ప్రజా ప్రభుత్వం (Democracy) దేశంలో స్థాపింపబడింది. కేవలం

వారి ఉత్సాహమే ప్రజా ప్రభుత్వ వ్యవస్థను సక్రమంగా నడపడానికి వాళ్లను సముత్సుల చేయజాలదు. అసలు స్పర్థ లేందే ఏ వ్యవస్థా వికాసాన్ని పొందదు. ఇతఃపూర్వం గొప్పగా గుర్తింపబడ్డ మేధావంతులు నేడు ఆ వ్యవస్థలో సామాన్యుడిగా పరిగణింపబడుతున్నాడంతే! దీనితో మరో రకమైన అనైక్యత దేశంలో వ్యాపించింది.

## ప్రపంచ సంఘంలో పరస్పర సహకారం:

సంఘంలోని వ్యక్తులేగాక సర్వతంత్ర స్వతంత్ర దేశాలు సైతం అంతర్జాతీయంగా పరస్పరాశ్రయత్వాన్ని గల్గివున్నాయి. దేశంలో అధికోత్పత్తివల్లగాని, లేక తీవక్షామంవల్లగాని, భూకంపాదులవల్లగాని విదేశ వ్యాపారం (Foreign Trade) దెబ్బ తింటుంది. పెద్దపెద్ద వ్యాపార కేంద్రాలు (Trade Centres) కలిసి కట్టుగా పనిచేయడంవల్లనే సామాన్యుడికి సైతం వస్తువులు లాభసాటిగా లభిస్తున్నాయి. రష్యా. తూర్పు యూరోపియన్ దేశాలు ఒకటిగా కలిసి అభివృద్ధి వర్గాలుగా తయారయి ఆర్థిక సంపదనంతా కొల్లగొంటున్నాయి. ప్రజా ప్రభుత్వ దేశాలు (Democratic Countries) సైతం ఆర్థిక సంపదకే గాక అనేక యితర అంశాలపై కలసి అభివృద్ధి వర్గాలుగా ఏర్పడ్డాయి. ఇలా దినదిన ప్రవర్ధమానమయ్యే వ్యక్తి యొక్క కార్యకలాపాలు మరో వ్యక్తితో కుపబడి విస్తృతమై, సాంకేతిక నైపుణ్యం మరింత పదును చేయబడి ప్రపంచ సంఘాన్ని సక్రమ మార్గంలో నడుపుతోంది. ఇలాంటి పరిస్థితుల్లో వ్యక్తి జీవించి ఉండాలంటే ఆయన తన కార్యకలాప పరంపరలో మార్పుకు (Change) ఎన్నిక (election) కు లోనై పరస్పరాశ్రయ సంబంధి దేశాల మధ్య సుస్థిర స్థానాన్ని సంపాదించాలి. అత్యధికోత్పత్తిపై ధ్యేయముంచినపుడు ఇతర దేశాలకంటె స్థాయిలో అత్యున్నత ప్రత్యేకత్వ (Higher-specialisation in Mass Production) మవసరము. తదనుసారం ఉద్యోగావకాశాలు పూరింపబడి పారిశ్రామిక కేంద్రీకరణంచే తిరిగి గొప్ప నైపుణ్యం జనించి అది మరల అత్యధికోత్పత్తికి తోడ్పడుతుంది. కాబట్టి వ్యక్తి నైపుణ్యాన్ని (Individual Skill) పదును పెట్టడానికి, దానికి సముచిత ప్రాధాన్య ముంచడానికి విశేషించి శ్రద్ధ తీసుకోవలసి ఉంది.

## గ్రంథాలయావశ్యకత:

ఎక్కడ 'వ్యక్తి నైపుణ్యం' అనే మాట వినబడుతుందో అది గ్రంథాలయానికి సంబంధించిన కార్యం. ఇక్కడనే గ్రంథాలయంయొక్క ఆవశ్యకత, తత్సార్థకత బుజువౌతూంది. ఇప్పుడు మనం ప్రపంచంనుండి దేశం, దేశంనుండి సంఘం, సంఘం నుండి వ్యక్తి, వ్యక్తినుండి వ్యక్తిగత నైపుణ్యానికి ఓ నిర్దిష్ట కేంద్రానికి చేరుకొన్నాం. అంటే గ్రంథాలయం ప్రపంచ పురోగతికి కేంద్ర స్థానీయమైనదన్నమాట! ఇది ఒక స్పైరల్ ఆకారం వంటిది.




ప్రస్తుత పరిస్థితుల్లో వ్యక్తిగత శ్రమతో కూడిన పరిశోధనలను (Researches) ఒక సక్రమ పద్ధతిలో పొందుపరచి తద్వికాసానికి దోహదం కల్పించాలి. అంతేగాక రెండు పరిశోధనల మధ్య నిక్షిప్తమైయున్న సంబంధాన్ని (inter-relationship between two researches) తత్సమాహార స్వరూపాన్ని, భిన్న ముఖాల ప్రసరించే మానవుని జీవితానుభవములను ఒక్కచోట ఏర్చికూర్చి స్వాదిష్టఫలం వలె చేతి కందించేవి గ్రంథాలయాలు. ఏదో ఒకానొక విద్యా విషయమందే ప్రత్యేకించి విశేష పరిశ్రమ చేయుటం (Higher-specialisation in a specific subject) ఇతర విద్యా విషయ గ్రహణానికాటంకంగా పరిణమిస్తుంది. నేడు కొత్తకొత్త విద్యా విషయాలు (New branches of knowledge) సృష్టింపబడుతున్నాయి. అత్యధిక పాక్షిక పరిశ్రమ (Increased specialisation) వల్ల అజ్ఞానం (ignorance) మరింత వృద్ధి ఔతుంది. అంటే, మిక్కిలి ప్రభావోపేతాలైన విష

యాలు సైతం మానవుని కందుబాటులో లేక మరుగు వడిపోతున్నాయి. పాఠ్యగ్రంథం విద్యాబోధనలో ప్రముఖ స్థానం ఆక్రమించటంలో బాహ్యమైన పరీక్షలకు విద్యార్థుల్ని తయారుచేయడమే ముఖ్యోద్దేశంగా కన బడుతోంది. ఆ గ్రంథం ఒక విశిష్టమైన అంగంగా పనికిరావడంలేదు. మనం తీసుకొనే ఆహారం పుష్టికర మైనదైతేనే అది ఉదరంలో ప్రవేశించాక జీర్ణమై శరీరాంగాలకు బలం చేకూర్చుతుంది. విద్య ప్రత్యంగ విశిష్టం కాకపోతే అది ఆశించిన ఫలవిూయజాలదు.

## జ్ఞానం-విజ్ఞానం:

జ్ఞానం (Know edge) నేటి దేశకాల పరిస్థితుల కనుగుణ్యమైన ఉత్పత్తికి దోహదమై ప్రత్యక్ష ప్రయోగ యోగ్య (Practical application) మైనపుడే దాని ప్రత్యేక విలువ (Specific Value) అవగతమౌంది. అప్పుడే జ్ఞానం విజ్ఞానమౌతుంది. (Knowledge becomes science) స్వకీయంగా నడిచే యంత్రాలు, ఎలక్ట్రానిక్ కంప్యూటర్లు విజ్ఞానాభివృద్ధికి సూచకాలు. నేడు కార్మికులశాంటి కొత్తయంత్రాల నెదుర్కొంటున్నారు. కాబట్టి ఈనాడు కండలు తిరిగిన శారీరక బలంతో, కాయలు కాచిన చేతులతోగాక సాంకేతిక నైపుణ్యం (Technical know how) తో యంత్రంమీద కార్మికుని బుద్ధిశక్తులపై ఉత్పత్తి ఆధారపడి యున్నది. విజ్ఞానాభివృద్ధి తద్వారా దేశాభివృద్ధి ఎంతగా పెరిగిందో తెలుసుకోవటానికి జ్ఞానరాశిలో (Univer e of know edge) ఎన్నిపాళ్ళ ప్రయోగం కింద తీసుకురాబడిందో, తద్వ్యాప్తిచే ఎంతగా బహుళ ప్రయోజకత్వం సాధింపబడిందో, అది కార్మికులకెంత సుపరిచితమైందో దానినిబట్టి నిర్ణయించాలి. వ్యక్తి వికాసం గాంచవలెనంటే తరగతి బహిరంగోపన్యాసాలు (Class-room lectures) ఏమాత్రం నిజంగా సాయపడవు. వ్యక్తిగత పరిశ్రమ (Indiuidual ef ort) చే ఉత్పత్తి నైపుణ్యం వికాసంచెంది, వృత్తి విద్యగా పరిణమిస్తుంది.

## గ్రంథాలయాధికారి సేవలు:

(Services of a Librarian)

ఇలాంటి వ్యక్తిగత నైపుణ్యాశ్రితమైన వృత్తి విద్యా వికాసానికి గ్రంథాలయాధికారి ఏ విధంగా సాయపడుతాడు? గ్రంథాలయ విద్య ఓ విజ్ఞానం! (Library Science) కేవలం జ్ఞానంకాదు. కాబట్టి అట్టి విజ్ఞానాన్ని ఆకళించుకొన్న గ్రంథాలయాధికారి సంఘాభివృద్ధికి దోహదకారియైన సేవల చేయ టంలో ముఖ్యుడు. ఓ కొత్త ఉత్సాహాన్ని, ప్రేరణను గల్గించి ఆత్మవిశ్వాసం (Self Confidence) తో కూడిన సత్ఫలదాయకమైన విజ్ఞానాన్ని విస్తరింప జేయటంలో ఆతని ప్రముఖ పాత్ర మరపురానిది. గ్రంథాలయాధికారి కృషీవలుడై పండిన, పండించిన జ్ఞాన కేదారాన్ని సంఘ క్షేత్రంపై వెదజల్లి బహుళ ప్రయోజకత్వాన్ని సాధిస్తున్నాడు. ఆతడు ప్రాచీన గ్రంథాలను, ఆధునిక భాషల్లో వ్రాయబడిన కొత్త పుస్తకాలను ఏ వ్యక్తి అపేక్షిస్తున్నాడో ఆ వ్యక్తికి సరైనకాలంలో సక్రమమార్గంలో కాలయాపనంచేయక అందిస్తున్నాడు. మానవజీవిత పరిస్థితుల్ని, అనుభవాలను విశ్లేషించి వివేచించి పరిష్కారమార్గాల సూచించటంలో వెనుకటి తరాల వారియొక్క సర్వరంగాలలోని కృషిని, నవీనుల పరిశోధనాఫలితాలను ఆయావ్యక్తుల కందజేయడంలో సత్ఫలితాలను సంఘవినియోగానికి అందించడంలో సహాయపడుతున్నాడు.

గతం లేకుండ వర్తమానంలేదు. కాబట్టి, ప్రతి గ్రంథాలయాధికారి ప్రతిసంవత్సరం, ప్రతినెల, ప్రతిదినం, ప్రతిక్షణం లభించే రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక, సాంకేతికవిషయాలను, మానవజాతి యొక్క నిత్యనూతనానుభవాలను క్రోడీకరించి అందు బాటులో నుంచుతున్నాడు. క్రోడీకరించిన జ్ఞానరాశిని సులభంగా సంపాదించడానికి ప్రజలకు, పాఠకులకు ప్రముఖసాధనంగా ఆతడు ఉపయోగపడుతున్నాడు. ఈనాడు పాఠకుడు ఉబుసుపోకకు ఏదో ఒక పుస్తకాన్ని తీసుకోవటం అనవసరం. విద్యాధ్యేయాలను సమన్వయించి చూపడంలో గ్రంథాలయాధికారి పుస్త

కానికి పాఠకుడికి మధ్య అనుభవజ్ఞుడైన మధ్యవర్తిగా (Mediator) ప్రవర్తిస్తున్నాడు. ఆతడు తన విచక్షణానైపుణ్యంచే పాఠకుని మనస్తత్వాన్ని, బుద్ధిశక్తినీ, తదభిలాషలోని లోతులను పసికట్ట గలడు.

ఇలాంటి సేవలవల్ల సంఘంలో రెండోరకపు మేధావివర్గం తయారవుతోంది. వీరు స్వయంగా పరిశోధనలు చేయకున్నా గొప్ప మేధాశక్తి సంపన్నులై అత్యున్నత సాంకేతిక పదజాలాన్ని, అస్పష్టమైన భావాలను సైతం అర్థంచేసుకోవటానికి తగిన సామర్థ్యంగల్గి ఉంటారు. వీళ్లూ సంఘాభివృద్ధిలో ఓరకంగా సాయపడేవాళ్లే. ఇలాంటివారు అనేక ఉన్నత విద్యావిషయాలను అవగాహనంచేసుకొని సామాన్య పాఠకుని భాషలో ఆతని కర్థమయ్యేరీతిలో పాఠ్య గ్రంథాలను (Text Books) తయారుచేస్తారు. అంటే వీరు అవగాహనకరతమైన విద్యావిషయాన్ని విరివిగా ప్రచారంలోకి తెస్తారన్నమాట!

గ్రంథాలయాధికారి సాంఘికధ్యేయ ప్రాప్తికోసం తన ప్రణాళికలో పుస్తకాల ఎన్నిక (Book Selection) సంపాదన (Acquisition) విభజనం (Classification) లేక వర్గీకరణం, సూచీకరణం (Cataloguing) చేసి సందర్భశుద్ధితో అమర్చడానికి యెల్లప్పుడూ శ్రమిస్తూంటాడు. ఈ వర్గీకరణం, సూచీకరణాలు నిర్దిష్టమైన పుస్తకాన్ని అతిస్వల్పకాలంలో చేతిలోకి రావటమే ముఖ్యధ్యేయంగా గలిగిఉండే ఉపకారణాలు మాత్రమే! దీనిలో జ్ఞానరాశిని (Universe of Knowledge) విశ్లేషణ సమన్వయపూర్వకం (Analytico-synthetic)గా వర్గీకరించడం ఆధునిక పద్ధతి. దీన్ని కోలన్ (Colon) వర్గీకరణ మంటారు. దీన్ని స్థాపించినవారు డా. ఎస్. ఆర్. రంగనాథన్.

(సశేషం)

---



# కలగూరగంప

## "నన్నపార్యుడు—జపహోమ తత్పరుఁడు—సంహితాభ్యాసుఁడంటే ?"

శ్రీ రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహమున, ఆస్థాన మహాకవి, ఆదికవి, వాగనుశాసనుడు నన్నయ భట్టారకులు భారతాంధ్రీకరణమునకు పూనుకొనిన మహనీయుడు.

శ్రీ రాజరాజ నరేంద్రుడు ఒకనాడు ఆస్థానమున నన్నయ నీ రీతిగ ప్రశంసించినట్లు భారతమున ఆదిపర్వమున గలదు. 'విద్వద్విలాస గోష్ఠి సుఖోపవిష్టుండై యిట్లు లనియే.'

'తన కుల బ్రాహ్మణును ననురక్తు
నవిరళ జపహోమ తత్పరు
విపుల శబ్దశాసను సంహితాభ్యాసు
బ్రహ్మాండాది నానా పురా
ణ విజ్ఞాన నిరతు, బాత్రు నాపస్తంబ
సూత్రు ముద్గల గోత్రు
జాతు సద్వినుతావదాత చరితు
లోకజ్ఞు నుభయభాషా
కావ్య రచనాభి శోభితు సత్ప్రతిభాభి
యోగ్యు నిత్య సత్యవ
చను మత్సమరాధిపాచార్యు
సుజను నన్నపార్యు జూచి
పరమ ధర్మవిదుండు వేర
చళుక్యాన్వయాభరణుం డిట్లనియెం
గరుణతోడ'

ఇందలి విశేషణములు మిక్కిలి యర్థవంతములు. 1. తనకుల బ్రాహ్మణుఁడు 2. అనురక్తుఁడు 3. అవిరళ జపహోమ తత్పరుఁడు 4. విపుల శబ్ద శాసనుఁడు 5. సంహితాభ్యాసు డు 6. బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుఁడు 7. పాత్రుఁడు 8. ఆపస్తంబ సూత్రుఁడు 9. ముద్గలగోత్రజాతుఁడు 10. సద్వినుతావదాత చరితుఁడు 11. లోకజ్ఞుఁడు 12. ఉభయభాషా కావ్య రచనాభి శోభితుఁడు 13. సత్ప్రతి భాభి యోగ్యుఁడు 14. నిత్య సత్యవచనుఁడు 15. అమరావార్య సన్నిభుఁడు 16. సుజనుఁడు నన్నపార్యుఁడు అను పదునారు గుణగణముల విశిష్టుఁడు అని యెరుంగదగియున్నది.

ఇట్లు పదునారు గుణగణముల విశిష్టుఁడనుటలో నొక ప్రత్యేకత గలదు. మంత్ర శాస్త్ర సాంప్రదాయ రీత్యా, షోడశీ యుపాసనా ధురీణుఁడను ధ్వని సహృదయ హృదయైక వేద్యము. యజ్ఞమున 'షోడశీ గ్రహణ' విధి యొండు గలదు. నీవిధి ననుసరించి సత్పురుష లక్షణ ధురీణుఁడనియు స్ఫూర్తి గలుగక పోదు. 'షోడశకళా విశిష్టుడు పురుషుడని తైత్తిరీయ బ్రాహ్మణమున గలదు. ('షోడశకళావై పురుషః) పదునారు విశేషణములే వాడుటలోని ప్రత్యేకతకు కారణము, వేదవచనానుసారము, ఉత్తమ పురుష లక్షణ విశిష్టుడనియు, 'షోడశీ' యుపాసనాధురీణుఁడనియు నెరుంగుటకై అర్థవంతమైన విశేషణములు వాడబడినదని మనవి జేతును.

(1) 'తన కుల బ్రాహ్మణుఁడు' విశేషమునకు పలువురు పలురీతుల నర్థము చెప్పుదురు. కానీ 'కుల' పదము తిక్కనయు వాడియున్నాడు. విరాట రాజు పుత్రుడైన యుత్తరుని, గోపాలురు వచ్చి స్తుతించు సందర్భమున:

'విరటుఁడు నిన్ను నెప్పుడు పది
వేవురు ముందటఁ జెప్ప
బాహువిస్ఫురితుఁడు శౌర్యశాలి
కులభూపతి విశేష
విధాయకుండు, భూభరణ విశార
దుండు జనభవ్య తపఃఫల
సంభవుండు కాతర పరిరక్ష
కుండనుచు దానికి నీడుగఁజేయు
మత్తటిక్.'

అనునెడ, 'కులభూపతి' వాడిన రీతిని, 'కుల బ్రాహ్మణ' పదము నన్నయ వాడెను. ఈ కుల బ్రాహ్మణ పదమును పరిశీలించినవాడు గనుకనే 'కుల భూపతి' తిక్కనకు స్ఫురించినది కాబోలు.

కులసాంప్రదాయధర్మ గుణగణయుక్త బ్రాహ్మణుడనిగాని కులమువారి కందరికిని పెద్దగ లాలించు

బ్రాహ్మణుడనిగాని యర్థము జెప్పుట యుక్తి యుక్తము.

(2) అనురక్తి పదము హృదయ ధర్మమునకు సంబంధించినది. అనురక్తమైన హృదయము గలవాడు. అనగా ప్రీతిపాత్రమైన మంచి మనసు గలవాడు అనురాగశీలమైనవాడనియు ననదగును.

(3) అవిరళ జపహోమతత్పరుడు. ఎల్లప్పుడు జపము హోమములతో తత్పరుడైనవాడు. ఈ జప పదము హోమ పదములను విపులముగ పరిశీలింప దగియున్నది. వివరణాదు లెఱుంగనేరక, జపహోమ పదములచే నన్నయ యజ్ఞము జేసినవాడని యర్థము జెప్పచుందురు. కాని యీ యర్థ మనర్థమునక తీరదు.

ఎందుచేతనగా వైదిక సాంప్రదాయమున, యొక్కొక్క కార్యమునకు తగిన రీతిని, హోమ జపాదులకు పేర్లు గలవుగాని—జపహోమపదము లనగనే యేవో యజ్ఞము జేసి హోమాదులు జేయువాడను నర్థము పొసగనేరదు.

ఉపనయనమైన వటువు, ఉదయము సాయంకాలము హోమములు జేయుట సాంప్రదాయము. ఈ హోమానికి, 'సమిధాధానము' అనిగాని 'అగ్ని కార్య' మనిగాని, వాడవలయునేగాని-బ్రహ్మచారి హోమము జేస్తూఉన్నాడని వాడరాదు. అదీ హోమమే గదా! యనిన, సాంప్రదాయ సాంకేతిక పదము నెరుంగనివాడని తలంతురు.

ఆ రీతిని వివాహమైన గృహస్థు గూడ ఉదయము సాయంకాలములలో హోమము జేయ దగియున్నది. ఈ హోమాలకు, 'ఔపాసనము' అందురు గాని, 'హోమము' అని వాడరు.

యజ్ఞము జేసినవానిని 'సోమయాజి' యందురు. ఇతను గృహస్థు జేయు ఔపాసనము, ఉదయ సాయంకాలములో జేయుచు, ప్రత్యేకించి మరియొక హోమము జేయును. ఈ హోమానికి 'అగ్నిహోత్రము' అని వ్యవహరింతురు.

ఇట్లు బ్రహ్మచారి అగ్నికార్యము, గృహస్థు ఔపాసనము, సోమయాజి అగ్నిహోత్రము నిత్యము ఉదయము సాయంకాలములలో మాత్రము జేయవలయుననివిధి విధానములు, ఆచారములు గలవు కానీ, అవిరళ జపము, హోమము, పై సాంప్రదాయములకు భిన్నముగ నున్నది. పోనీ ఆ యర్థములే యీ హోమ పదానికి అన్వయించుదామనుట సాంప్రదాయ విరుద్ధము. రాజసభలో, పదప్రయోగ, నన్నయము కూడను టకై, అసాంప్రదాయార్థపు పదాలు వాడువాడైన వాడు వాడునా? విజ్ఞులు హర్షింతురా? అని యాలోచింప దగియున్నది.

యజ్ఞములోగల హోమాలకు ప్రత్యేకనామములు గల పదా లున్నవి. యాగపదము వాడెదరు. 'ఇష్టులు' అని, యాగములని, అందలి హోమాలకు పేర్లున్నవి. ఈ రీతిని యజ్ఞ సాంప్రదాయానికిని, గృహస్థ ధర్మానికిని పొసగని నన్నయ వాడిన హోమ పదానికి యర్థ మేమిటి? జప పదాని కర్థ మేమిటి? త్రికాలములలో మాత్రమే గాయత్రీ జప విధానమున్నది. అవిరళ జప మేమిటి? హోమ మేమిటి? యని తలంతుమేని, మంత్రశాస్త్ర సంబంధమైన మంత్రములు, అవిరళ జపములను జేయవచ్చును. అందలి మూలమంత్రాదులకు చేయు హోమాలకు 'హోమము'లనియు వ్యవహరింతురు. ఆ రీతిని మంత్రశాస్త్ర సంబంధమైన శ్రీ విద్యాయుపాసనకు లోనై అవిరళ జపములు పంచదశి-- షోడశివంటివానిని చేయువాడనిన, యుక్తియుక్తముగ నున్నది. ఆ రీతిని మంత్రశాస్త్రరీత్యా చేయబడు, చండీహోమము శ్రీ విద్యాహోమమువంటి హోమాలు తలంచిన వెంటనే చేయుచుండువాడని గాని, శ్రీ విద్యాయుపాసన, శ్రీ విద్యా సంబంధ హోమములు, అవిరళముగ జేయువాడని చెప్పుట యుక్తము గాని, వేదము నేర్చినవాడని వేదమంత్రాలు జపించువాడని, యజ్ఞము జేసినవాడని జెప్పడము వేదవేత్తలు హర్షించరు. సాంప్రదాయ ధురీణులు హేళన జేతురు. కాన ఆనాటి రాజసభలోని విద్వజ్జనులు, హర్షించు రీతిని, మంత్రశాస్త్ర మంత్రాలు జపించుచుండువాడని—శ్రీ విద్యాచండీ హోమాదులు చేయుచుండువాడని, తలంచుటకైన విశేషణము అర్థవంతముగ వాడబడినదని యెరుంగుట సాంప్రదాయ ధురీణులకు నిదర్శనము.

యజ్ఞమే జేసియున్నచో క్రతువ్యాపృతులు జేయువాడనిగాని, ఇతర యాగములు చేసినవాడు, లనిగాని సాంప్రదాయిక పదప్రయోగ మొనర్చియుండును. అలా వచించనందున, పై తెలిపిన రీతిని మంత్రశాస్త్ర సంబంధమైన జపతప హోమాదు లనవరత మాచరించు మంత్రశాస్త్రవేత్తగా భావింపదగియున్నది.

నాలుగవ విశేషణము విపులశబ్దశాసనుడు. ఈ విశేషణముచే, సంస్కృతాంధ్ర వ్యాకరణములను కుణ్ణముగ నేర్చినవాడని సర్వజన విదితము.

'అయిదవ విశేషణము సంహితాభ్యాసుడు.' ఈ విశేషణముచే వేదము . నేర్చినవాడనియు, వేదము సర్వదా చెప్పుచుండువాడనియు సామాన్యుల భావన. ఎందుకనగా సంహితలు వేదములలో నొక భాగానికి పేరున్నది కాన, ఆ సంహితలను నేర్చినవాడై యుండ నోపు' అని తలంచి వేదము నేర్చినవాడని 'వైదికి' యని తలంచుట పరిపాటైపోయినది. కానీ నన్నయ భట్టారకులు వేదమే నేర్చియున్నచో, 'వేదాభ్యాస తత్పరుడ ననిగాని, క్రమపాఠకుడననిగాని, ఘనపాఠి ననిగాని వచించియుండునుగాని సంహితాభ్యాస తత్పరుడనని యేనాటికి యే పరిస్థితిలోను వచించెడి వాడే గాడని ఘంటాపథముగ చెప్పదగియున్నది.

కారణమేమనగా, పదునొకండవ శతాబ్దమున వేంగీదేశమనదగిన, గోదావరి ప్రాంతమున వేదశాస్త్రవేత్తలు కోకొల్లలుగ నుండువారని ప్రతీతిగల రాజరాజ నరేంద్రుని రాజ్యమున, వేదములో నొకభాగమైన సంహితలను నేర్చినవాడై క్రమ, జటాఘనాంత వేద పండితుల ముందెప్పడము నన్నయ ఘనతను న్యూనతగాని గౌరవము రాదే !

వేదములు నాలుగు. ఋగ్యజుస్సామాథర్వణము లని పేరు. నన్నయ 'ఆపస్తంబసూత్రుడు' అని చెప్పికొనియున్నందున, యజుశ్శాఖీయుడనబడగియున్నది. యజుర్వేదము, శుక్ల, కృష్ణభేదములతో ద్వివిధము. ఆపస్తంబసూత్రుడుగాన, కృష్ణయజుర్వేదానికి సంబంధించినవాడు. ఈ క్షితిపథమున తైత్తిరీయ శాఖా సంబంధమైన కృష్ణయజుర్వేదము, ఎనుబదిరెండు ప్రశ్నలేకాక అధ్యాయాలు (పన్నములు)తో గలదు. 'అశీతిద్వయమని'యు వ్యవహారము. ఈ ఎనుబది రెండు ప్రశ్నల (అధ్యాయాలు) పైకి నలుబదినాలుగు అధ్యాయాలకు సంహితయందురు. ఇరువదియెనిమిది యధ్యాయాలకు బ్రాహ్మణ భాగమందురు. పది యధ్యాయాలకు ఆరణ్యకమందురు. ఇట్లు, బ్రాహ్మణ, ఆరణ్యకములువదలి కేవలము సంహితాభాగమునేర్చి, యనవరతము, సంహితాభ్యాసుడనని రాజాస్థానమున, మహాపండితులముందు, ఘనాంతస్వాధ్యాయవేత్తలముందు మహాకవి లోకజ్ఞుడనబరగు నన్నయ చెప్పకొనడము గౌరవదాయకమా? అగౌరవదాయకమా? యోచించుడు!

సంహిత యనబడు వేదభాగము, నలువదినాలు గధ్యాయాలకు స్వరసహిత పదచ్ఛేదము నేర్తురు. దీనికి పదము నేర్వడమని పేరు. సంహిత నలువదినాలు గధ్యాయాలు, పదము నలువదినాలు గధ్యాయాలువెరసి. ఎనుబదియెన్మిది యధ్యాయములగును. దీనికి క్రమము నేర్తురు. అందుచే మరలా నలువదినాలుగధ్యాయాలు కలిసి, (44+44+44) నూటముప్పదిరెండధ్యాయాలు (132) దీనికి జటచేర్చిన మరలా నలువది నాలుగధికమగును. (44+44+44+44)నూటా డెబ్బదియారధ్యాయాలు (176) అగును. దీనికి ఘనము చెప్పినచో నలువదినాలుగధ్యాయాలు అధికమై (44×5=210) రెండువందపదియధ్యాయా లగును. బ్రాహ్మణభాగము ఇరువదియెన్మిది యధ్యాయాలు, ఆరణ్యకము పదియధ్యాయాలు చేరినచో రెండువందలా నలువదియెన్మిది యధ్యాయాలగును. ఈ రెండువందలా నలువదియెన్మిది (248) యధ్యాయాలు నేర్చిన వేదవేత్తను ఘనపాఠియందురు. రెండువందలానాలుగధ్యాయాలు నేర్చినచో జటావల్లభు లందురు. నూటాఆరువది యధ్యాయాలు నేర్చిన వానిని క్రమపాఠియనిగాని, అవధాన్లు అనిగాని యనుట లోక వ్యవహారమైనది. నూటపది యధ్యాయాలు నేర్చినచో పదము నేర్చిన వాడందురు. ఎనుబది రెండధ్యాయాలు నేర్చిన వానిని మూలమధ్యయనమైన వాడందురు. ఈ మూలమనబడుదానిలో సంహితాభాగమనబడు నలువది నాలుగధ్యాయలు నేర్చిన వానిని సంహిత నేర్చిన వాడని వ్యవహరింతురు.

ఇట్లుండగ, మతిలో బృహస్పతి సదృశుడు. లోకజ్ఞుడు ఉభయ భాషావేత్త వాగనుశాసనుడు, ఆదికవి రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి, ఘనపాఠీలు క్రమపాఠీలు వివిధశాస్త్రవేత్తలతో గూడిన రాజసభలో విద్యా వినోద గోష్ఠిలోనుండు తరిని, నన్నయ తానొక సంహితాభ్యాసుడనని సభామధ్యన వచించినచో నది నన్నయ గొప్పదనానికి కళంకమేగాని, ఘనతగాదే! ఎం. ఏ. చదివిన వారి సభలో III వ ఫారము చదివిన వాడు తానొక యింగ్లీషు నేర్చిన పండితుడనని చెప్పికొనిన ఎం. ఎ. వారికెంత భావము గల్గునో, ఘనపాఠీలు, క్రమపాఠీల ముందు తానొక సంహిత నేర్చిన వేదపండితుడనని వ్రాసికొనిన నంతటి భావమేయని, విన్నవింతును. సహృదయులు పరికింతురుగాక.

అయినచో 'సంహితాభ్యాసుఁడ'నని నన్నయ చెప్పిన దానికెట్లు అర్థము పొసగడమని యోచింతు మేని, తొలుతమనవి జేసిన రీతిని, 'జపహోమ తత్పరుడుగాన 'మంత్ర శాస్త్రవేత్త' గనుక, అనవరతములు, జపములు హోమములు చేయువాడుగాన 'మంత్ర శాస్త్రమునగల 'సంహితలు' అనువానిని అభ్యసించుట గాని, వేదాంత సంహితలను అభ్యసించుటగాని యుండి యుండును. మంత్ర శాస్త్రమున కొన్ని సంహితలు గలవు. వేదాంత శాస్త్రమున కొన్ని సంహితలు గలవు. ఈ మంత్ర శాస్త్ర సంహితలుగాని వేదాన్త సంహితలను గాని, పఠించడ మొక విజ్ఞతకు లక్షణము. నన్నయ భట్టారకులు ఆ విజ్ఞతా లక్షణ విశిష్టుడుగాన పై సంహితల పఠించు మేధావియని యెరుంగదగి యున్నదిగాని; పదక్రమ జటా ఘనముల దాని కేవలము వేద సంహితాభ్యాసుడని గుర్తించి వైదికుడని అంగీకరించుట వేదశాస్త్రములు స్వరూప స్వభావము లేని యెరుగనేరని వారి వాదనయని తిరస్కరింపదగి యున్నది. వేదవేత్త యే నన్నయయై యున్నచో రాజ సభలో ఘనాభ్యాస తత్పరుడు, క్రమాభ్యాస తత్పరుడు జటాభ్యాస తత్పరుడని చెప్పికొని యుండును గాని సంహితాభ్యాసుడని చెప్పికొని యుండడు. వేదములోని భాగములు, క్రమజటా ఘనముల విధులు తెలియని వాడుగ మాడా! తెలియకున్నచో 'మతినమరాచార్య సన్నిభుండుగా లేడు. లోకమునగల విద్యలు వాని వేత్తలు తెలియని రాజ సభాస్థాన విద్వాంసుడుగాడు గదా! సర్వము నెఱింగిన వాడు గనుకనే 'లోకజ్ఞు'డని వచించెను.. సర్వమును నెఱింగిన 'సుజనుడు', కనుకనే 'సర్వనుతావదాత చరితుడు' యోగ్యుడు' అయినవాడై తన సత్ప్రవర్తనచే, అభియోగ్యుడు కాగల్గినాడు.

'నవనవోన్మేషః ప్రతిభా'యని బుద్ధిలో సందర్భానుకూలముగ గల్గు నూహలకు 'ప్రతిభ'యని తలంపు. ఈ యూహలు మంచివి కావచ్చు, చెడ్డవి కావచ్చు, కాని సభాయోగ్యము, జనరంజకము, ధర్మానుగుణము, శాస్త్ర మర్యాదలకు తగిన యూహలు సత్ప్రతిభకు నిదర్శనము. ఈ రీతిని సత్ప్రతిభాభి యోగ్యుడు నన్నపార్యుడు. ముద్గల గోత్రుడు. ముద్గల మహర్షి వంశ సంజాతుడని భావము. ఈ ముద్గల గోత్రులు పదునెన్మిది భేదములతో నుండునని గోత్రప్రవర కాండమున, ధర్మశాస్త్రకారులు నిర్ణయించియున్నారు. ఆంగిరస—భార్మ్యశ్వ మౌద్గల్యులుగను, ఆంగిరస—తార్క్ష్య—మౌద్గల్యులనిగాని త్రయార్షేయములో, ఆపస్తంబ మహర్షి కల్పసూత్రములు ప్రమాణముగా గొనువాడై, నిత్య సత్కర్మనిరతుడై వెలసిన నన్నయ భట్టారకులని యెరుంగదగియున్నది కాన నిరంతరము జప హోమ తత్పరతకు మంత్రశాస్త్ర సంబంధమైన మంత్ర జపములు హోమములు చేయువాడనియు, సంహితాభ్యాసు డనుటరు, మంత్రశాస్త్ర సంహితలు వేదాంతశాస్త్ర సంహితలు అభ్యసించువాడనియు నెరుంగదగియున్నదని మనవి జేతును.

షోడశ కళాప్రపూర్ణుడు చంద్రుడు. షోడశ కళాపూర్ణుడు ఉత్తమ విద్వాంసుడు. కాన, ఈ పదునారు విశేషణములతో గూడిన సత్తమ కళాపూర్ణుడు నన్నపార్యుడని, యెరింగి పరమధర్మమూర్తియైనవాడు, వరచాళుక్యాన్వయాభరణుడు, అయిన రాజరాజ నరేంద్రుడు, విద్యావిలాసగోష్ఠి సుప్రసిద్ధుడైయుండి భారత మాంధ్రీకరించుమని, వేడికొనుట యోగ్యము, యుక్తియుక్తము, విశ్వసనీయము కాదగినదని మనవి జేతును. విజ్ఞులు పరిశీలింతురు గాక.

—శ్రీ షడ్దర్శనం సోమసుందర శర్మ.

# గ్రంథవిమర్శలు

## ముండకోపనిషత్

(ఆంధ్ర వివరణ సహితము: వివరణ కర్త: శ్రీ న. చ. రఘునాథాచార్యులు, డెమ్మీ 12+212 పుటలు. వెల 5 రూ. శ్రీమదుభయవేదాంతాచార్య పీఠము ట్రస్టువారిచే ప్రకటితము. ప్రాప్తిస్థానము: వాసుదాసాశ్రమము, నడిగడ్డపాలెం, P. O. తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా. లేక—శ్రీమాన్/డాక్టర్ డి. టి. నరసింహాచార్యులుగారు, ఆయుర్వేద వైద్యులు, చౌరస్తా, హనుమకొండ, వరంగల్ జిల్లా.)

వేదాంతార్థాలను వివరించే ఉపనిషత్తు లన్నింటిలోనూ ముండకోపనిషత్తు ప్రధానమైనది. దీనికి శ్రీమతస్థులూ తమ తమ మతాలకు అనుకూలంగా వ్యాఖ్యానం వ్రాసి ఉన్నారు. విశిష్టాద్వైత మతంలో అపారమైన కృషిచేసి, ఉభయవేదాంత ప్రవర్తకులైన రఘునాథాచార్యులుగారు భగవద్రామానుజుల సిద్ధాంతానుసారంగా ఈ ఉపనిషత్తునకు చక్కని తెలుగు వివరణం వ్రాశారు.

ఆస్తికమతాలపయి అభినివేశం, ఆసక్తి తగ్గిపోయి లౌకికదృష్టియే వ్యాప్తంగా ఉన్న యీ కాలంలో ఆ యా మతాలను గురించి తెలుసుకొనుటకు ఇట్టి వివరణ గ్రంథాలు ఎంతగానో ఉపయోగిస్తాయి.

ఉపనిషత్తులన్నీ ఆత్మతత్త్వాన్నే బోధించేవయినా, ఈ ముండకోపనిషత్తునకు ఒక ప్రత్యేకత ఉన్నది. ముముక్షువులకు అత్యంతావశ్యకమైన అర్థపంచకముయొక్క వివరణ సంగ్రహంగానూ, స్పష్టంగానూ ఇందులో ఉన్నది. ప్రాప్యమైన బ్రహ్మ పదార్థంయొక్కయు, దానిని పొందే ప్రత్యగాత్మయొక్కయు, ఉపాయ, ఫలములయొక్కయు విరోధియొక్కయు స్వరూపం ఇందు స్పష్టపరచబడినది.

ఈ ఉపనిషత్తు కొన్ని ఖండాలుగా విభజింపబడి ఉన్నది. శ్రీరామానుజసంప్రదాయాన్ననుసరించి, ఇది ఆరు ఖండాలు. శంకరుల సంప్రదాయానుసారంగా ప్రథమ, ద్వితీయ, తృతీయ ముండకాలనే విభజనా, ఒక్కొక్కదానిలోను రెండేసి ఖండాలూ (మొత్తంపై) ఆరుఖండాలుగా కానవస్తున్నది. పాఠభేదాలు కూడా కొన్ని కానవస్తున్నవి. ఆ పాఠాల ఔచిత్యానౌచిత్యాలను పరిశీలించి, ఈ వివరణకర్త సరియైన పాఠాన్ని గ్రహించినట్లు తెలుస్తున్నది.

శ్రీ రఘునాథాచార్యులుగారు విశిష్టాద్వైత మతానికి చెందినవారు. అందువల్ల దీని వివరణాన్ని శ్రీరామానుజుల సిద్ధాంతాన్ని అనుసరించే కూర్చారు. స్వమతాన్ని స్థాపించవలసి వచ్చినప్పుడు ఇతరమతాలను ఖండించడం అవసరం. అట్టిచోట ఇందు శ్రీ శంకరుల అభిప్రాయం నిరసించబడడం ఉన్నది.

రచయిత ఈ ఆంధ్రవివరణరచనకయి ఎట్టి కృషి చేసినదీ వారి 'చిన్న మనవి'లోని యీ మాటల వల్లనే తెలుస్తున్నది -

'శ్రీభాష్యశ్రుతప్రకాశికాది ప్రాచీనగ్రన్థములలో నున్న పలు సిద్ధాంత ముఖ్యవిషయములను సందర్భవశమున క్రోడీకరించి చేర్చితిని. మంత్రములలోని పాఠభేదములను చర్చించితిని. ఆ యా మంత్రములలో శ్రీ శంకరుల వివరణవైఖరిని శ్రీరామానుజ మతానుయాయులు ఏల పరిగ్రహింపలేదో, సహేతుకముగా పరిశీలించితిని. అచ్చటచ్చట శ్రీరంగరామానుజభాష్యమున గూడ శ్రీభాష్య శ్రుతప్రకాశికాది విరుద్ధములగు నంశములనుగూర్చి విమర్శించితిని. సందర్భవశమున కొన్ని బ్రహ్మ సూత్రాధికరణములను వ్యాఖ్యానించితిని.'

ఆరవ ఖండంలో ఆరవ మంత్రం. 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః' అనే దానికి వీరు వ్రాసిన వివరణాన్ని గమనిస్తే వీరి ప్రగాఢ పరిశ్రమ వ్యక్తమవుతుంది.

విషయం అగాధమైనందున పెక్కుసార్లు పఠిస్తేనేగాని అవగాహన కావడం సాధ్యం కాదు. అవగాహన అయినా విస్మృతిలో పడడమూ సహజమే! అందుకని రచయిత ప్రత్యేకంగా 'ముండకోపనిషత్

సారసంగ్రహ' నామంతో ఇందలి సారాన్ని క్రౌను సైజున 16 పుటలలో దీనిని సంగ్రహించి ముద్రింపించి అనుబంధంగా అందిస్తున్నారు. ఇట్టి గ్రంథాలకు సారరూపమైన లఘుగ్రంథాలుండడం ఎంతో ఉపకారకం.

ఈ గ్రంథం విశిష్టాద్వైతులకేకాక, ఆ మత తత్వాన్ని తెలియగోరిన వారికి అందరికీ ఎంతో ఉపయోగిస్తుంది.

## శ్రీ భగవద్గీత

(శ్రీ కైలాస-మానససరోవరవాసి శ్రీ స్వామి ప్రణవానంద విరచిత శ్రీ జ్ఞానదీపికా వ్యాఖ్యా సహితము. $\frac{1}{4}$ క్రౌను సైజు. 32+536 పుటలు. వెల 25 రూ. ప్రకాశకులు-శ్రీరామ జ్ఞానమందిర పబ్లికేషన్ లీగ్, గొంగనమూడి పోస్టు, పశ్చిమ గోదావరి జిల్లా, ప్రాప్తిస్థానము-ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాదు, మద్రాసు, మచిలీపట్నం.)

సర్వోపనిషత్తుల సారభూతమైన భగవద్గీత ఆత్మతత్వాన్ని తెలిసికొనగోరేవారి కందరికీ అత్యంత ప్రధానమైనది. మతత్రయంవారే కాకుండా తిలక్, అరవిందులు, గాంధిమహాత్ముడు మున్నగు మేధావు లందరూ పెక్కు విధాలుగా దీనికి వ్యాఖ్యలను రచించి యున్నారు. గీతా విషయంలో అపారమైన కృషి చేసిన శ్రీ స్వామి ప్రణవానంద దీనికి అతివిపులమైన ఆంధ్ర వ్యాఖ్యానాన్ని 'జ్ఞానదీపిక' అనే పేరుతో రచించి, తమ గురువర్యులు శ్రీ జ్ఞానానందయతీంద్రులకు అంకితం చేశారు.

దీనికి ప్రస్తావనను కూర్చిన శ్రీ స్వామి ప్రజ్ఞానానంద 'పూర్వ వ్యాఖ్యానములు ఏదియో యొక మత సంప్రదాయమునకు, దృక్పథ సిద్ధాంతమునకు జెందినవై యున్నవి. శ్రీమద్భగవద్గీతయందు దన్ని దృక్పథ సిద్ధాంతములకు తావుండుటచే ఆ యా మహిమాన్విత వ్యాఖ్యానములు గౌరవ స్థానము నాక్రమించుచునే యున్నవి.........ప్రకృతమున శ్రీమత్ప్రణవానందస్వామి వ్యాఖ్యానమును దట్టులకాక నిష్పాక్షిక దృక్పథముతో మూలము ననుసరించి అచ్చటచ్చటి ప్రసంగ యాథార్థ్యమును తమ సాధనాశ్రమ స్వానుభవమును, శ్రుతి స్మృతి, దర్శన, పురాణేతిహాసాది గ్రంథ పరిశోధనానుభవమును జతపఱచి వివరించుచు, సందర్భోచిత గ్రంథ ప్రమాణముల నుల్లేఖించుచు, తమ గీతా వ్యాఖ్యానమును ఆదినుండి అంతమునఱకును కడు సావధాన చిత్తముతో సాగించి, సాధక పాఠకలోకమున కందించుటెంతేని ముదావహము' అని వ్రాయుచున్నారు. దీనిని బట్టి ఏతద్వ్యాఖ్యా ప్రాశస్త్యము వ్యక్తమగుచున్నది.

ప్రతిభా శాలులును, సర్వశాస్త్ర నిష్ణాతులును పరమార్థ దర్శనమున కృతార్థులు అయిన శ్రీస్వామి వ్రాసిన విధంగా ఇంత విపులంగా ఆంధ్రంలో మరొకరు వివరణ వ్రాసినట్లు కానరాదు. 'గాయత్రీ ఛందసా మహం' మున్నగువానికి వీరిచ్చిన వివరణము పై విషయాన్ని వ్యక్తం చేస్తున్నది.

భక్తి, జ్ఞాన, కర్మ ధ్యాన యోగాల్లో ఏదో ఒక దానినే స్వీకరించి తదనుగుణంగానే చాలామంది వివరిస్తారు. శ్రీ ప్రణవానందస్వామి మాత్రం యీ యోగ చతుష్టయాన్ని చక్కగా సమన్వయించి, తమ ప్రత్యేకతను వ్యక్తం చేశారు. అంతేకాక ప్రపంచంలోని ముఖ్యమతాల్లో చెప్పబడిన యోగాలనుకూడా సమన్వయించారు.

గ్రంథంచివర శ్లోకాల ఛందోవివరణం, ఆ యా వ్యక్తులచే చెప్పబడిన శ్లోకాల సంఖ్యావివరణం, అష్టాంగయోగవివరణం, పరమాత్మలక్షణాలు, బ్రహ్మ ప్రాప్తికి సాధనముల వివరణ, భగవానుని నామములు తదర్థములు, అర్జుననామాలు -- వాటి అర్థాలు, అవసరమైన మార్పులు చేయబడినవి. ఇవి జిజ్ఞాసువులకు అత్యంతోపయుక్తములు.

దీనికి శ్రీ డి. యస్. శాస్త్రిగారు 'విజ్ఞప్తి' వ్రాశారు. అందులో శ్రీస్వామి జీవితవృత్తాంతం, ఆయన ప్రతిభావిశేషాలు, బహుముఖపాండిత్యాన్ని ప్రకటించే ఆంధ్రాంగ్ల రచనలు వివరింపబడినవి.

ఈ మహత్తర గ్రంథ ప్రకటనకు తిరుపతి దేవస్థానంవారు, వదాన్యశేఖరులు, ఉదారులు ఆర్థికంగా సాయపడడం, దీని ప్రకటన బాధ్యతను శ్రీ డి. యస్. శాస్త్రిగారు వహించడం ప్రశంసనీయాలు.

కొంత మూల్యం నిర్ణయించబడినా, వాస్తవంగా అమూల్యమైన ఈ గ్రంథం పారమార్థిక దృష్టిగలవా రందరూ చదవదగినది.

## భాసనాటక చక్రము

(భాస మహాకవికృత సంస్కృత నాటకముల కనువాదము. గ్రంధకర్త: కావ్యతీర్థ, కవితావతంస, శ్రీ గట్టి—లక్ష్మీనరసింహశాస్త్రి, (సాహితీ సమితి)—ప్రథమ భాగము—క్రౌను 287 పుటలు. వెల : 6 రూ. ద్వితీయ భాగము—క్రౌను 280 నుంచి 504 పుటలు. వెల : 5 రూ. తృతీయ భాగము—క్రౌను. 505 నుండి 693 పుటలు. వెల : 4 రూ.

ప్రకటనకర్త: సాహితీ గ్రంధమాల తెనాలి పక్షమున శ్రీ ప్రఖ్య—సమీర కుమారదేవ, 17 A (10—3—155) సరోజినీదేవి రోడ్డు, సికిందరాబాదు—26.

ప్రతులకు ప్రకటనకర్తకు గాని, శ్రీ కూచి భొట్ల వీరరాఘవశాస్త్రి, కల్యాణీప్రెస్, తెనాలి—అనే చిరునామాకుగాని వ్రాయవలెను.)

సంస్కృత వాఙ్మయంలో దృశ్యకావ్యాలు ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. అవి విదేశీయుల యొక్కయు ప్రశంసలను అందుకున్నవి. మహాకవి కాళిదాసు రచించిన నాటకాలు అతనికే కాకుండా భారతావని కంతటికీ గొప్ప ప్రశస్తిని సంపాదించి పెట్టాయి. ఆ కాళిదాసు తన మాళవికాగ్నిమిత్ర నాటక ప్రస్తావనలో భాసుణ్ణి ప్రశంసించాడు, గొప్ప నాటకకర్తగా. అంటే—అతకు పూర్వమే భాస నాటకాలు ప్రఖ్యాతమై ఉన్నవన్నమాట. కాని, యించుమించు అరవైయేళ్ల కిందటివరకూ భాస నాటకాలలో ఒక్కటిన్నీ లభ్యం కాలేదు. త్రివేండ్రం లోని సంస్కృత గ్రంథావళి, మహామహోపాధ్యాయ త. గణపతి శాస్త్రివారి అపూర్వ పరిశోధన మూలంగా సుపరిష్కృతంగా ఆ నాటకాలను ప్రచురించి సంస్కృత వాఙ్మయాభిమానులకు మహోపకారం చేసింది.

భాస మహాకవి రచించిన పదమూడు నాటకాలు లభ్యములైనవి. అవన్నీ ముద్రితాలయినవి. మొత్తంగా వాటికి 'భాసనాటక చక్రం' అనే పేరు వచ్చినది.

ఆలంకారికులు చెప్పిన నాటక లక్షణాలకు కొంత భిన్నంగా ఏతద్రూపక రచన జరిగినట్లు కాన వస్తుంది. అర్వాచీనాలయిన ఈ లక్షణాలు వెనుకటి నాటకముల యెడల సమన్వయించకపోవడం వింతకాదు. భాసనాటకాలు చాలా సులభశైలిలో, దీర్ఘసమాస రహితంగా, రసవంతంగా సంగ్రహంగా రచించబడి ఉన్నవి. ఆ నాటకాలలో రామాయణ కథకు సంబంధించినవి రెండు, భాగవత కథకు సంబంధించినది ఒకటి, భారత కథకు సంబంధించినవి మూడు, వత్సరాజు కథకు చెందినవి రెండు, ఇతరములు రెండు ఉన్నవి.

భాసనాటకాలు వెలువడిన తొలి రోజుల్లోనే ఇవి ఆంధ్ర విద్వత్కవుల నాకర్షించినవి. సుప్రసిద్ధ విద్వత్కవి విమర్శకులు మానవల్లి—రామకృష్ణకవి గారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చిలకమర్తి—లక్ష్మీనరసింహంగారు అప్పటి వీని అనువాదకులు. వీటిలో మానవల్లి వారి బాలచరితం, వేటూరివారి ప్రతిమ, చిలకమర్తివారి స్వప్నవాసవదత్తం బహుళ ప్రచారాన్ని పొందాయి. ఆ తర్వాత చాలామంది కవులు వీటిని తెలిగించారు. ఇప్పటికీ వీటి అనువాదాలు వస్తూనే ఉన్నవి. అట్టి వానిలో ఈ నాటక సంపుటి ఒకటి.

రచయిత శ్రీ గట్టి—లక్ష్మీనరసింహశాస్త్రిగారు సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర విద్వత్కవులు. అనేక సంస్కృత కావ్య నాటకములను అనువదించి లబ్ధ ప్రతిష్ఠులైనారు. వారి రచనలలో అమరుకంవంటి చిన్నకావ్యాలే కాకుండా శిశుపాలవధ వంటి మహాకావ్యలను కూడా అనువదించారు. భవభూతి నాటక త్రయాన్నీ శ్రీహర్ష నాటకత్రయాన్నీ, ప్రబోధ చంద్రోదయం వంటి వేదాంతార్థ ప్రతిపాదక శాంతరస ప్రధాన నాటకాన్నీ, ఇతర కావ్య, చంపూ ప్రబంధాలనూ తెలిగించారు.భాసనాటకాల నన్నింటినీ ఆంధ్రీకరించారు. ఇన్ని కావ్యములనూ, నాటకములనూ తెలుగులోకి తర్జుమా చేసినవారు శ్రీ శాస్త్రిగారొక్కరే జ్ఞప్తికి వస్తున్నారు. ఇన్ని గ్రంథాలను మూలానుగుణంగా ఆంధ్రీకరించడం ఎంతో ప్రతిభ ఉన్నవారికిగాని సాధ్యం కాదు.

ఈ భాసనాటకాలు పదమూడున్నూ రచయితచే పాతిక సంవత్సరాలకు ముందే వ్రాయబడినవి. రచించడంలోనే కాని, వాటి ప్రకటనలో వారు శ్రద్ధ చూపలేదు. వారు విరక్తులయి తురీయాశ్రమాన్ని స్వీకరించి, పరమహంస, పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ నృసింహానంద భారతీస్వామి పాదు లయినపిదప లౌకిక సంబంధాలను పూర్తిగా విసర్జించినందున వాటి

ముద్రణ, ప్రచురణ భారాన్ని వహించనందున వారి శిష్యతుల్యులైన శ్రీ ప్రఖ్య సవిారకుమార దేవ ప్రభృతులు ఆ భారాన్ని వహించి శ్రీ శాస్త్రిగారి యితర గ్రంథాలతోపాటు — ఈ భాసనాటక చక్రాన్ని ఆంధ్రప్రదేశ ప్రభుత్వం వారి ఆర్థిక సహాయంతో ప్రకటింపబూనుకున్నారు.

ఇందలి మొదటి భాగంలో వత్సరాజు కథకు సంబంధించిన స్వప్న వాసవదత్త, ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకాలు రెండు, అవి మారకం, దరిద చారుదత్తం అనే రెండు నాటకాలు—మొత్తం నాలుగు నాటకాలున్నవి. ద్వితీయ భాగంలో భాగవతంలోని దశమస్కంథానికి చెందిన బాలచరిత నాటకం, రామాయణ కథకు సంబంధించిన ప్రతిమా, అభిషేక నాటకాలు రెండూ మొత్తం మూడు నాటకాలు ఉన్నవి. తృతీయ భాగంలో భారతానికి సంబంధించిన పంచరాత్ర, ఊరుభంగ, దూతవాక్య, మధ్యమ వ్యాయోగ, దూత ఘటోత్కచ, కర్ణభారాలనే ఆరు నాటకాలున్నవి. అన్నింటిలోనూ భారత నాటకాలే చాలా హ్రస్వమైనవి.

రచయిత ఈ దృశ్య కావ్యాలలో నీచపాత్రలకు తత్తత్పాత్రోచితంగా వ్యావహారిక భాషను వాడక, ఉత్తమ పాత్రలకువలెనే గ్రాంథికాన్నే ఉపయోగించారు. ఇలా వ్రాసే సంప్రదాయం తెలుగులో గత శతాబ్ది చివరనే ప్రారంభమైనది. గ్రాంథికభాష ఉపయోగింపబడినా అది సులభంగా అర్థమవుతూనే ఉంటుంది. వచన భాగమే కాకుండా శ్లోకాలుకూడా అర్థం ఏ మాత్రమూ చెడకుండా తెలిగింపబడినవి. ఉదాహరణకు రెండు శ్లోకాలనూ, వాటి అనువాదాలనూ చూడవచ్చు.

మూలము—

శ్లో. సుఖం హి దుఃఖాన్యనుభూయ శోభతే
ఘనాంధకారేష్వివ దీపదర్శనమ్,
సుఖాత్తు యో యాతి నరో దరిద్రతాం
ధృతః శరీరేణ మృతః స జీవతి.'

[ప్రథమభాగము—పుట 234. దరిద్రచారుదత్తము—ప్రథమాంకము]

అనువాదము—

తే. గీ. కష్టపడినమీఁద సుఖమ్ముఁ గాంచవచ్చుఁ
బెద్ద చీఁకటిలోనుండి వెలుఁగునట్లు
కుడుచుచు సుఖంబులను బేదపడునరుండు
తనువు దాల్చియు మృతునిచందమున బ్రదుకు.'

ఇందులో మూలాభిప్రాయం పూర్తిగా వచ్చింది.

మూలము—

శ్లో. 'శాసితోఽహం త్వయా రాజన్
ప్రయామి న చ దోషవాన్,
త్యక్త్వా కోపం చ కామం చ
యథాకార్యం తథా కురు.'

[ద్వితీయభాగము—పుట 471. అభిషేకము—తృతీయాంకము.]

అనువాదము—

తే. గీ. నన్ను శాసించితివిగాన. గ్రన్న నిపుడ
వెడలిపోయెద దోస మే వీసమెఱుఁగ,
రోసమును గామమును ద్రోసివేసి దవుల
నొప్పు చొప్పునఁ గార్యము నూను మధిప.'

మూలంలోని 'న చ దోషవాన్' అనే దానికి 'దోస మే వీసమెఱుఁగ' అనే తెలిగింపు ఎంతో సరసంగా ఉన్నది.

అనువాద మంతా ఈ రీతినే సాగినదని చెప్పవచ్చును. సంస్కృతంలోని మూల గ్రంథాలలో ఉన్న దానిని సమగ్రంగా తెలుసుకొనవలెనని అభిలాష పడేవారు శ్రీ శాస్త్రిగారి అనువాదాలను చదవడం ఎంతో ఉచితమై ఉంటుంది. ఈ "భాసనాటక చ"క్రాన్ని అందరూ ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య.

# భారతదేశము — ఒక పర్యాలోకనము

(ఆంగ్ల మూలం: శ్రీ జార్జి కురియన్ — తెలుగు అనువాదం: శ్రీ బి. విద్యానాథ్. ప్రచురణ కర్త: నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ యిండియా. న్యూఢిల్లీ, పేజీలు: 18[illegible]. వెల: రు. 5—50.)

'భారతదేశపు ప్రత్యేకతను వివరిస్తూ, ఆ విశిష్టత సమకూర్చిన వివిధ విషయాలనూ విశదీకరిస్తూ స్థూలరేఖలద్వారా దేశస్వరూపాన్ని ఆవిష్కరించే గ్రంథం' అని యీ పుస్తకానికి పీఠికలో నేషనల్ బుక్ ట్రస్ట్ అధ్యక్షులైన డా|| బి. వి. కేస్కర్ పేర్కొన్నారు. పుస్తకాన్ని పూర్తిగా చదివిన తర్వాత యీ అభిప్రాయం ప్రతిపాఠకునికీ కలుగుతుంది.

రెండువందల పేజీల లోపల సువిశాలమూ, ప్రాచీనమూ, శతాబ్దాల క్రితమే ప్రపంచ విజ్ఞాన కేంద్రంగా విలసిల్లిన దేశాన్ని గురించి పరిచయం కలిగించడం కష్టసాధ్యం. శ్రీ కురియన్ ప్రపంచ ఖ్యాతి పొందిన భూగోళ శాస్త్రవేత్త. అందుచేత సహజంగా ఆయనకు మనదేశంయొక్క నైసర్గిక పరిస్థితులు, వాతావరణం, పంటలు, వనరులు మొదలైన విషయాలను గురించి పరిచయంచేసే బాధ్యత అప్పగించబడింది. ఆ బాధ్యతను ఆయన సంతృప్తికరముగా నిర్వహించారనడం సంపూర్ణ సత్యం. ప్రతిపుటలోనూ రచయితయొక్క పరిపక్వ మేధస్సు, వివిధ శాస్త్రాలలో సన్నిహిత పరిచయం గోచరమవుతాయి.

ఇందులో మొదటి అయిదు ప్రకరణాలు భూగోళ విజ్ఞానానికి సంబంధించినవి. దేశస్వరూప స్వభావాలు, ప్రకృతి రూపురేఖలు, శీతోష్ణ స్థితిగతులు, నేలలరకాలు— జూసారము, అడవులు వృక్ష సంపదలను గురించి యీ ప్రకరణాలలో వివరించబడింది. తరువాతి అయిదు ప్రకరణాలలోనూ, మనం దేశంలోని సహజసంపదను సమాజ క్షేమం నిమిత్తం ఏ విధంగా వినియోగపరచుకున్నామో తెలుపబడింది. నీటిపారుదల సౌకర్యాలు, వ్యవసాయం—పశుపోషణ, శక్తిసంపదలు ఆర్థికాభివృద్ధి పరిశ్రమలు, రవాణా సౌకర్యాలు అన్న అంశాలు విపులంగా చర్చితమయ్యాయి. తరువాయి రెండు ప్రకరణాలు జనాభా అధ్యయనానికి (Demography) జాతి, భాషాపరమైన అధ్యయనానికి నాందిగా ఉపకరిస్తాయి. ఉపసంహారంలో విద్యావిషయికంగా మనం సాధించిన ప్రగతిని గురించి రచయిత ప్రస్తావించారు.

కేవలం స్థూలరేఖలను ప్రదర్శించడమే లక్ష్యం కావున వివిధ సిద్ధాంతాలను సంబంధించిన వారి ప్రతివాదాలను పేర్కొనడానికి అవకాశం లేనిమాట వాస్తవమే. కాని వివాదాస్పదమైన అంశాలను గురించి రచయిత తన అభిప్రాయాన్ని పేర్కొనేటప్పుడు అందుకు ఆధార భూతమైన కారణాలను, యితర అభిప్రాయాలను దిఙ్మాత్రంగా సూచించడం ఉచితం. ఉదాహరణకు, భారతదేశానికి మొట్టమొదట వలస వచ్చిన జాతి ద్రావిడులు అన్న అభిప్రాయం. అలాగే ''నేలలో ఎంత తక్కువకాలం ఉంటే రాలుబడి అంత తక్కువ'' (పు. 67) అన్న అభిప్రాయం కొత్త రకాల గోధుమల విషయంలో సత్యంకాదు. ఆలోచనను ప్రేరేపించే ప్రశ్నలు అనేకం పాఠకుని మనస్సులో నాటుతుంది ఈ పుస్తకం. ఉదాహరణకు ప్రాచీన భారతీయ సంస్కృతి తూర్పుకే ప్రసరించింది కానీ పశ్చిమంగా ఎందుకు సాగలేదు? హిమాలయాలు మన దేశంవైపు నిట్టనిలువుగానూ టిబెటే. చైనావైపు వాలుగా ఉండటం వలన మొలకెత్తే దేశరక్షణ సమస్య లేమిటి? ఉత్తర భారత దేశంలో వేసవి బాధాకర మైనప్పటికీ ఆరోగ్యకరంగా ఉండటానికి కారణమేమిటి? చిత్రములు దేశపటములు గణాంక వివరములతో యీ పుస్తకం చక్కగా రూపొందించబడింది. ఇవి రచనలో పేర్కొన్న అంశాలను ఉద్దీపింప జేయడానికి తోడ్పడతాయి. కేరళ ఉప్పుటేర్లు, హిమాలయాలలోని కోనిఫర్ అడవులు. బొగ్గుగనులు, విమానాల తయారీ మొదలైన చిత్రాలు చక్కని ఆర్టుకాగితంమీద ముద్రింపబడ్డాయి. శైలి సరళంగా ఆహ్లాదకరంగా ఉన్నది.

శ్రీ విద్యానాథ్‌గారి అనువాదం సాఫీగానే సాగింది. అయితే అక్కడక్కడ పదాల ఎన్నికలో కొంచెం జాగరూకత వహించవలసినది. Water-shed line కి నదీజలరేఖ (పు. 15) అనడం, Organic manures కి 'జంతు సంబంధమైన ఎరువులు' (పు. 60) అనడం శాస్త్రీయం కాదు. 'దారి వెంటసాగే బాటసారుల గుంపులనూ, దిగువ ప్రాంతాలలో నివసించే ప్రజలనూ కొల్లగొట్టుకొని జీవించడమే వీళ్ల దృష్టిని ఆకర్షించే విధానం' అన్న వాక్యం (పు—57) 'వాళ్లకు నచ్చే విధానం' అన్న

షష్ఠీ విభక్త్యర్థంకాక, 'వాళ్ల దృష్టిని యితరులు ఆకర్షించే విధానం' అన్న ద్వితీయా విభక్త్యర్థాన్ని యిచ్చే ప్రమాదం ఉన్నది. ఇలాంటి స్వల్పలోపాలు మినహాయిస్తే, అనువాదం సరళ శుద్ధ వ్యావహారిక భాషలో సాగింది. దేశాన్ని గురించి తెలుసుకొనడానికి పెద్దలు పిన్నలూ చదువవలసిన పుస్తకం.

—శ్రీ వి శ్రీరామచంద్ర.

## ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం

(రచన: ఎం. వి. రామమూర్తి: ప్రచురణ స్టేట్ బుక్ క్లబ్, నారాయణగుడా, హైదరాబాద్ 500029 వెల: సాదా ప్రతి రెండు రూపాయలు. లైబ్రరీ ఎడిషన్ అయిదు రూపాయలు.)

ముందు మాట, పూర్వచరిత్ర, ప్రత్యేక ఆంధ్రోద్యమ ఆవిర్భావము, ఉద్యమతీవ్రత, ప్రత్యక్షచర్యల ఉపసంహారం, ఉద్యమ స్తబ్దత, వివిధ వర్గాల నడక, నడత, ఉద్యమము వెంటనే సఫలత పొందక పోవడానికి కారణాలు; విమర్శ, వాదనలు—ప్రతివాదనలు చివరి మాట అనే పది అధ్యాయాలున్నాయ్ 130 పుటల ఈ పుస్తకలో.

1913 లో బాపట్లలో జరిగిన ఆంధ్ర మహాసభ తీర్మానాలనూ, 14-11-1937 న మద్రాస్‌లో దేశోద్ధారక నాగేశ్వరరావుగారి భవనం శ్రీ బాగ్‌లో జరిగిన శ్రీ బాగ్ ఒడంబడిక సంగతినీ ముందు మాటలో శ్రీ రామమూర్తి వివరించారు. తెలంగాణా నాయకులు, ఆంధ్ర నాయకులు కలసి 1956 లో పెద్దమనుషుల ఒప్పందం చేసుకున్నారు. ఇది నాయకుల మధ్య జరిగిన వప్పందము. ఈ వప్పందము మున్ముందు తెలంగాణా రక్షణలకు, తరువాత ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి, తద్వారా ఆంధ్రులకు జరిగిన అవమానాలకు, పరాభవాలకు, అష్టకష్టాలకు, చివరకు ప్రత్యేక ఆంధ్రోద్యమానికి నాంది అయింది' అన్నారు 5 వ పుటలో. పెద్ద మనుషుల వప్పందంలోని నిబంధనలను ఆరు, ఏడు పుటలలో ఉటంకించారు.

తెలంగాణా ఉద్యమానికి మానసిక కారణాలు, ఆర్థిక కారణాలు, నిమిత్త కారణాలో ఉన్నవన్నారు. '1969 ఫిబ్రవరి 28, 29 లలో ఆంధ్రుల యిళ్లను గుర్తుపెట్టుకుని దాడి చేశారు. అప్పటికి 30 ఏండ్లనుండి స్థిర నివాసము యేర్పరచుకున్న ఆంధ్రులుకూడా ఇట్లా దౌర్జన్యాలకు గురి అయ్యారు. (12 వ పుట)' అని విశదం చేశారు ఈ రచయిత.

ఇటీవల జరిగిన చరిత్ర ఇదంతా. రాజకీయ విద్యార్థులందరూ తీరికగా చదివి చర్చించడానికి వీలుగా ముల్కీ నిబంధనల కథనూ, ఆ నిబంధనలపై సుప్రీమ్‌కోర్టు తీర్పునూ పొందుపరిచారు ఈ పుస్తకంలో.

ఆంధ్రోద్యమ చరిత్రలో 1972 డిసెంబరు 24 ప్రాముఖ్యాన్ని 35 వ పుటలో వివరించారు ఈ గ్రంథకర్త.

'జనవరి 18 నుండి వరుసగా మణిపురం అమరావతి, మాచర్ల, పిడుగురాళ్ల, గుంటూరు, విజయవాడ, పాలకొల్లు, నరసాపురం, ఏలూరు, కాకినాడ, రాజమండ్రి. పొందూరు, బారువలలో ప్రభుత్వం కాల్పులు సాగించింది. పథకం ప్రకారం ప్రజలను భయ, భ్రాంతులను చెయ్యాలనే సంకల్పముతో చేసినట్లు కన్పడుతుంది (43 వ పుట) అన్నారు శ్రీ రామమూర్తి. కనిపించడమేమిటి? సరిగ్గా ఆ లక్ష్యంతోనే అన్ని కాల్పులను జరిపించారు.

ఆంధ్ర మంత్రుల ఢిల్లీ పర్యటనతో ఉద్యమం బలహీనపడడం ప్రారంభమయింది. స్వర్గీయ శ్రీ బి. వి. సుబ్బారెడ్డిగారి వైఖరిలో మార్పురావడంతో ఉద్యమాన్ని మరి కొంత బలహీనపరచింది. ప్రత్యక్ష చర్యల ఉపసంహారంతో ఉద్యమం స్వభావంలో మార్పు వచ్చింది. ఎట్టి చేతులతో (ఢిల్లీనుంచి) శ్రీ బి. వి. తిరిగి వచ్చారని తేలిపోయింది (68 వ పుట) ఆర్. టి. సి. బస్సులు పికెటింగ్ విఫలమైంది. రైళ్లు నడుస్తున్నై. ప్రభుత్వోద్యోగుల ఆత్మకసి తిరిగి వచ్చారని ... విషమించింది. ఇంతకంటే మరేం కావాలి అంత ఉవ్వెత్తున ప్రారంభమైన ఉద్యమము విఫలం కావ

డానికి ? వీటన్నింటికి తోడు విద్యార్థుల వైఖరిలో కూడా మార్పు వచ్చింది.

జై ఆంధ్ర ఫ్రంట్ అవతరణ

'ఏప్రిల్ 6 న రాజమండ్రిలో జరిగిన జై ఆంధ్ర కార్యాచరణ సమితిలో జై ఆంధ్ర ఫ్రంటు నిర్మాణానికి అత్యధికసంఖ్యాకులు ఆమోదము తెలిపారు. ఏప్రిల్ 7, 8 తేదీలలో మహాసభ జరిగింది. (76 వ పుట)'. ఈ జై ఆంధ్ర ఫ్రంట్ ఒక కార్యక్రమం ఇచ్చింది. కానీ, ఎంతమంది కార్యకర్తలు ఆచరణలో పెట్టారూ ఆ కార్యక్రమాన్ని?

ఈ ఉద్యమంలో వివిధ వర్గాల నడకమూ, నడతమూ 78 వ పుటనుంచి 107 వ పుట వరకూ శ్రీ రామమూర్తి చర్చించారు. ఈ ఉద్యమంపట్ల కమ్యూనిస్టులు, మార్క్సిస్టు — లెనినిస్టుల వైఖరులనూ విమర్శించి ఆంధ్రోద్యమానికి అంకితమైన కుటుంబాలకు జోహారు లర్పించారు. కమ్యూనిస్టుల వైఖరిని 105–106 పుటలలో విమర్శించారు.

లాయర్ల కార్యాచరణ సమితి పాత్రను 113 వ పుటలో విశదం చేశారు. డాక్టర్లు, గ్రామ మునసబులు, — గ్రామోద్యోగులు, భూస్వాములు, వ్యాపారస్తులు, మధ్యతరగతి, చేతివృత్తులవారి కృషిని పరిశీలించారు న్యాయవాది అయిన ఈ గ్రంథక — వేర్పాటు ఎం. ఎ. లు మోసం చేశారని, శ్రీ రామమూర్తి అభిప్రాయం. వేర్పాటు ఆంధ్ర కాంగ్రెసు వారి ద్రోహం, ప్రజల అలసట, ఉద్యమం అహింసాయుతంగా నడవకపోవడం, సమైక్య నాయకత్వం లేకపోవడం దానికి దోహద పడినవన్నారు.

ఢిల్లీలో ప్రచారం జరగలేదు. ఈ ఉద్యమాని కనుగుణంగా. ఒక ఆర్గనైజేషన్ లేదంటూ ఈ ఉద్యమానికి సంబంధించిన వాద ప్రతివాదనలలోని పసను చర్చించి శ్రీ రామమూర్తి ఈ పుస్తకాన్ని ఇట్లా ముగించారు: 'ప్రత్యేకాంధ్ర వస్తుందా? సామాన్య మానవుడు వేసే ప్రశ్న—ఇది. ఉద్యమాన్ని అవగాహన చేసుకోగల శక్తి, తీరిక, ఓపికలేక సూటిగా అడిగే ప్రశ్న. దానికి జవాబు ఆంధ్ర, తెలంగాణా ప్రజలు యివ్వాలి. వారు నిర్మించుకునే నాయకత్వం చాలా వరకు నిర్ణాయక శక్తిగా వుంటుంది.''

ఈ ఉద్యమాన్ని సరయిన పంథాన నడిపించాలని ఈ గ్రంథ రచయిత చేసిన కృషి, పడిన తాపత్రయం ఏమంత తక్కువైనవి కావు. కానీ, వారు సూచించిన నాయకత్వం ప్రజలలోనుంచే రావాలి గదా? ప్రజలే నిర్మించుకొనగలగాలి గదా? ఆ శుభసమయము వస్తే ఆంధ్ర—తెలంగాణా సమస్య యేనాడు— ఈనాడు ప్రజలను పీడించుతున్న ఇంకా చాలా సమస్యలు కూడా పరిష్కారమవుతయ్. మరి ఆ శుభ ముహూర్తం ఎప్పుడో?

—శ్రీ వి. ఎస్. అవధాని.

## మాయ జలతారు

(నవల)

(రచన: శ్రీ దాశరథి రంగాచార్య. 250 పేజీలు, రు. 5/-0. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.)

బతుకు తెరువుకోసం బస్తీ చేరుకున్న పేదల జీవితాలు ఎన్నో చూస్తూనే వున్నాం. ఈ నవలలో అలాగే హైదరాబాదుకు వలసపోయిన నిరుపేద కుటుంబాల చరిత్ర కథా వస్తువయింది. విశేషమేమిటంటే—డబ్బు నిషాతో కులికే ఘరానా పెద్దలు ఆ గ్రామీణుల అమాయకత్వాన్ని తమ స్వార్థానికి ఉపయోగించుకోవడంలో దౌష్ట్యం, దౌర్జన్యం, అమానుష్యత్వంవంటి దురాకృతాలు అడుగడుగునా కళ్లకు కడతాయి. రచనలో తెలంగాణా పల్లె ప్రజల నుడికారం యథాతథంగా వాడడంతో కథ ఇంకా సజీవమయింది.

మధ్య మధ్య గణింపతగిన ధర్మపన్నాలు పాత్రల నోట వినవస్తాయి. 'ఇంత అన్యాయం అవుతే ఎలా? సిమెంటులో బలపపు పొడి కలుపుతే కట్టడం నిలుస్తుందా? ప్రజల సొమ్ము ఇలా దుర్వినియోగంచేస్తే దేశం ఎలా బాగుపడుతుంది చెప్పండీ' అంటూ

కంట్రాక్టర్ రాజారావుని ఛీఫ్ ఇంజనీరు ప్రశ్నించడం కాలానుగుణ్యమైన ప్రసక్తి. ఇదేకాదు. జనప్రియమైన సెక్సు విభాగమూ, ఫలితంగా విషాదాంత సంఘటనలూ సందర్భోచితంగా చోటు చేసుకున్నాయి. లెక్కకు మిక్కిలి మోసాలూ దురాగతాలూ సంకలనంగా కూడిన ఈ నవలకు 'మాయ జలతారు' పేరు ఉచ్చితంగా తగిఉన్నది.

—శ్రీ రవి.

## తిరిగి వచ్చిన గాడిద

(మూలం : కిషన్‌చందర్, అనువాదం : నీరుకొండ హనుమంతరావు $\frac{1}{4}$ క్రౌన్ సైజు 92 పేజీలు; వెల : రు. 3-00. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2.)

'తిరిగివచ్చిన గాడిద' పరిమాణంలో 92 పేజీలే అయినా, నేటి సమాజంమీద మంచి సెటైర్. ఇది చదువుకున్న ఒక తిరుగుబోతు గాడిద ఆత్మకథ. పేపరు చదివే అలవాటేకాదు, నెహ్రూతో ఇంటర్‌వ్యూలో పాల్గొని పేరు కెక్కిన గాడిద ఇది

ఈ గాడిద స్వస్థలమైన బారాబంకీ వదలి ఢిల్లీ చేరుకుంది. అక్కడినుంచి మధుర మిఠాయి తినబోయి, లాఠీపోట్లు తిని, గ్వాలియర్‌లో తాన్‌సేన్ సమాధిచెంత, సంగీతం పాడి చెప్పుదెబ్బలు తిని బొంబాయి చేరుకున్నది. బొంబాయిలో ఇది ఎత్తిన అవతారాలు అనంతం. గడ్డిమోపులు మోసింది. దొంగ సారా రవాణా చేసింది. గుర్రప్పందాలలో పాల్గొనింది. కాటన్ మార్కెట్ నెంబర్లు చెప్పింది. బ్యాంక్‌లో డబ్బు దాచింది. సినిమా తీసింది. తనూ నటించింది. బ్యాంక్‌లోని లక్షలన్నీ కరిగిపోయినా, పిక్చరు పూర్తి కాదు. చివరికి గాడిద గాడిదగా మిగులుతుంది.

'కళ్లు మూసుకొని భవిష్యత్ అదృష్టం చెపితే కళ్లు మూసుకొని విని ముందుకుపోయే రోజులు పోయాయి. యిక లేవండి. నేను పత్రిక చదివి, పుస్తకాలు చదివి సరిగ్గా అదృష్టం చెపుతాను. సరియైన జీవిత లక్ష్యాలు చెపుతాను జూదంలోకాక కష్టంలో.' ఇవి నవలకు భరతవాక్యం మాటలు.

ఇందులో సమకాలీన వ్యవస్థమీద కిషన్‌చందర్ విసిరిన కొన్ని విసుర్లు ఆలోచింపదగినవి.

'ఒక కళాకారుడంటే తోటి కళాకారుడికే గిట్టదు. ఇక ఈ లలితకళలను భగవంతుడే రక్షించాలి.' (7 వ పే.)

'కలవాడి ఆకలి మనోరంజనమైనది. కూలివాని ఆకలి తప్పనిసరియైనది.' (9 పే.)

'ఇవాళ రేపు ఇండియాలో మాలా చదువుకొన్న గాడిదలు చాలా (చాలా గాడిదలు అవి ఉండడం సబబు) చేసే పనేమిటి? ఒకటి గుమాస్తాగిరి, రెండవది భిక్షాగిరి. అవునా కాదా? నువ్వే చెప్పు ఇప్పటివరకు యెవడైనా చదువుకొన్న మంచియోగ్యుడు కోటీశ్వరు డయ్యాడా?' (11 వ పే) ఇవాళ సరే 'రేపు' అనడం గమనించదగ్గది. మన దేశ భవిష్యత్తు మీద చాలామందికంటె భిన్నమైన అభిప్రాయం కిషన్‌చందర్‌కు లేదు.

'వస్తువులన్నీ సంగుల్దే. శాస్త్రీయ సంగీతాన్ని కూడా ఈనాడు సుగమ సంగీతంతో కలిపి విని పిస్తున్నారు.' (26 పే)

'ఈనాడు ఏ కేడిలాక్, రోల్సురాయిస్ కార్లోనో తిరిగేవాడికి కుల గౌరవం వంశ మర్యాదలు వుంటాయ్ కాని, కాలినడకన తిరిగే గాడిదకు కుల మేమిటి? వంశ మేమిటి?' (39 వ పే.)

'చదువుకొన్న గాడిదలకు రక్తమే కాదు, బుర్ర కూడా చెడుతుంది' ఇది గాడిద కథ కాబట్టి సరి పోయిందికాని, లేకుంటే.........

'జీవలు చేస్తున్నది అదే గదా ! రక్తమాంసాలొడ్డి పొట్టలకు గడ్డి నింపుకోవడం.' (42 పే.)

కిషన్‌చందర్ ఇతర నవలల్లో ఉన్నట్టుగానే దీనిలోనూ చలనచిత్ర రంగంలోని కుళ్లు మీద వ్యంగ పూరితమైన విమర్శ ఉన్నది.

'అధోముఖ వృక్షం'లో జాతివర్ణ భేదాల విమర్శ ఉన్నది. ఆ విమర్శ ఇందులోనూ ఉన్నది.

అచ్చుకు పూర్వం ఎవరైన అనుభవజ్ఞులకు చూపిఉంటే అనువాద రచన ఇంకా తృప్తికరంగా ఉండే దేమొ ! వాక్యవిరామాది సంకేతాలు అవసరమైన చోట్లకంటె అవసరం లేనిచోట్ల విరివిగా ఉన్నాయి. ఇది అచ్చుపనివాళ్ల ప్రతిభో, అనువాదకుని అశ్రద్ధో 'తిరిగివచ్చిన గాడిద' చెప్పడంలేదు !

—శ్రీ నూతలపాటి.

## కృష్ణాతీరం

(నవల)

(రచన : కీ. శే. మల్లాది రామకృష్ణశాస్త్రి. పాకెట్ సైజులో 200 పుటలు. ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం—మద్రాసు—సికింద్రాబాదు. ప్రచురించినప్పటి వెల : రు 2—50 పైసలు)

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు 'తెలుగు'లో రచనలు చేసిన ఎన్నికగన్న కొందరిలో మన్నన గడించిన వారు. ఆయన తెలుగు సాహిత్య ప్రక్రియ అన్నిటా అంతో ఇంతో తమ ముద్ర ప్రసరింపజేసిన వారు. పాటలు కట్టినా, కథలు అల్లినా, నవలలు వ్రాసినా, గల్పికలు కల్పించినా ఆయన వాటిని తమ ముద్ర (మల్లాది రామకృష్ణశాస్త్రీయమైన ముద్ర) ప్రస్ఫుట మయేటట్లు తీర్చిదిద్దారు. ఆ తీర్చి దిద్దడంలో జాను తెనుగుకు పట్టంకట్టి తెలుగు సాహిత్య రాజ్యాన్ని ఏలించారు.

'కృష్ణాతీరం' మల్లాది శాస్త్రిగారు రచించిన నవలలో ఒకటి. శాస్త్రిగారి తక్కిన రచనలకువలెనే కృష్ణాతీరానికి ప్రత్యేకత ఉంది. ఎమెస్కోవారు ఈ నవలను 'ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో అనర్ఘ రత్నం'గా వెలువరించడం ప్రశంసింపవలసిన విషయం.

'కృష్ణాతీరం'శాస్త్రిగారు బృహన్నవలగా వ్రాయ డానికి సంకల్పించిన రచన అంటారు. ఆ విషయం జ్ఞాపకం ఉంచుకొని ఈ నవలను చదవాలనడం శాస్త్రిగారికి న్యాయం చేకూర్చడంకోసంకాదు; మనకు ఒక మంచి రచన పూర్తిగా దక్కలేదనే విషయాన్ని తలచుకొని బాధపడడంకోసం.

'కృష్ణాతీరం' నవల ఇతివృత్తం తెలుగుజాతి గత చరిత్రను జ్ఞాపకానికి తెచ్చే 'జాతి కథ. తెలుగు సంస్కృతికీ జాతీయతకు ఈ నవల చక్కని నిరూపణ.

'కృష్ణాతీరం'లోని ప్రధాన పాత్ర అన్నప్పశాస్త్రి. అవనిగడ్డలో స్థిరపడి పురాణం చెప్పుకొనే అన్నప్ప అందరికీ అభిమానపాత్రు డవుతాడు. అసలు ఈ నవలలో అన్నప్పది కీలక పాత్ర. అలిగి అటు ఒకరిటు ఒకరైన ఆలుమగలకు (అమ్మడు—రామ శేషులకు) పొత్తు కుదర్చడం దగ్గరనుండి, కులేతర వివాహం చేసుకొన్నవాడికి (అమ్మడు సోదరుడు సుబ్బారామయ్యకు) అయినవారి అండదండలు చేకూర్చ డానికి యత్నించడందాకా అతడు ఎన్నోపనులు చక్క బెడతాడు. అన్నప్ప 'సకల మంచివాడు.' అతడు ఏం చెప్పినా ఎదుటివాళ్ల మంచికే. అన్నప్ప మాటతీరు, చేతసారు మల్లాది శాస్త్రిగారిని జ్ఞాపకం చేసే టట్లు ఉంటాయి. అన్నప్పతోబాటు కథ కూడా వదిలి వెళ్లిపోతూ ఉంటుంది. ఆ 'కృష్ణాతీరం'కథను సంగ్రహంగా చెప్పి తప్పించుకోవడం కంటె, దాన్ని తప్పక చదవండని చెప్పి ఒప్పించడం బాగు.

ఈ నవలలో వచ్చే రాజమ్మ, సీతారామా చార్లు, రంగడు (ఆడదే !), లచ్చి, సుబ్బన్న మొదలైన పాత్రలు మనకు మరపురానివి. ఆ పాత్రల ప్రవర్తించేతీరు, సంభాషణల విధం ఎంతో ఇంపుగా ఉంటాయి. ఈ నవలలో చదువరులను ఆకర్షించే అంశాలలో సంభాషణా రచన, వర్ణనా చాతుర్యం మెచ్చి పేర్కొనదగ్గవి. అయితే కాశీమజిలీ కథలలో వలె కథలోంచి కథలు పుట్టుకు రావడంచేత ఈ నవల కొంచెం మందగతితో సాగుతుంది.

కాని, అందరూ (కులమత భేదాలకు అతీతంగా) ఒక్కటే అనే సత్యకాలంనాటి ఆ మనుష్యుల గురించి అందమైన తెలుగులో చదవాలనుకుంటే 'కృష్ణాతీరం' చదవాలి. ఇది చదివితే తెలుగు కుటుంబాల ఆపేక్షలు, అంతఃకరణలు, మర్యాదలు, మన్ననలు తెలుస్తాయి. [ఎందుకంటే— అవే ఈ నవల ఇతివృత్తానికి దోహదం చేసిన అంశాలు.]

కృష్ణాతీరంలోని వెలనాటి వైదిక కుటుంబాల వారి కష్టసుఖాలను శాస్త్రిగారు ఈ నవలగా తీర్చిదిద్దారు. అసలు ఆయనకు తమ స్వస్థలం (కృష్ణాతీరం) మీద ఉండే అభిమానానికి ఈ నవలపేరే నిదర్శనం. అయితే ఆ అభిమానం ఒక్క కృష్ణాతీరంమీద మాత్రమే కాదు—తెలుగుమీద, తెలుగు జాతిమీద ఆయనకు ఎంతో ప్రేమ.

ఈ నవలకు శ్రీ బి. నళినీ కాంతరావు, శ్రీ పి. ఎస్. గోపాలకృష్ణ 'మానసోల్లాసం' అనే చక్కని పరిచయం వ్రాశారు.

మల్లాది శాస్త్రిగారు ఒకప్పుడు శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని గురించి వ్రాసిన మాటలు ఆయనపట్లకూడా సార్థకం అవుతాయి:

''ఆయన మాటలు మరో భాషకు లొంగవు. జాము తెలుగు నేర్చినవారికే, తెలుగువారికే శ్రీ శాస్త్రి గారి కథలు చదివి ఆనందించే అదృష్టము!'

ఆ అదృష్టాన్ని 'కృష్ణాతీరం' చదవడంద్వారా కన్నుల కప్పుకోవలసిన బాధ్యత తెలుగు చదువరులది.

## దూరతీరాలు

(నవల)

[రచన: 'మంజుశ్రీ' (డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు) ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాదు. పాకెట్ సైజులో 204 పుటలు వెల: రూ. 2–50]

ఉండీలేని మధ్యతరగతికి చెందిన విశ్వం అనే యువకుడి కథను 'దూరతీరాలు' నవల చెపుతుంది. విశ్వం ఎన్నెన్నో అనుకొంటాడు. ఏవేవో కలలు కంటాడు. ఉన్నదానికీ, అనుకొన్నదానికీ మధ్యఉన్న తేడాలు మధ్యతరగతి ప్రజలు జీవితంమీద ఎటువంటి ప్రభావాలు కలగజేస్తాయో రచయిత 'మంజుశ్రీ' ఈ నవలలో చక్కగా వివరించారు.

చదువు ముగించి చిన్న చిన్న ఉద్యోగాలుచేసి కుదుటబడని విశ్వం తన చిన్ననాటి చెలిమికత్తె, తన పెద్ద మామయ్య కూతురుఅయిన పార్వతిని చూడ డానికి బళ్లారికి పోతాడు. పోయినచోట మనుష్యులు అభిమానంకంటె దురభిమానాన్ని ప్రదర్శించి విశ్వాన్ని బాధిస్తారు. అక్కడినుంచి రైల్లో ఊరికి బయలు దేరిన విశ్వం దారిలోనే రాజుకొండలో దిగిపోతాడు. రాజుకొండలోఉన్న తన పెదతండ్రి ఇంటికి పోతాడు. పెదతండ్రి, ఆయనకూతురు మైత్రేయి విశ్వాన్ని ఎంతో ఆదరిస్తారు. విశ్వం అక్కడే స్కూల్లో టీచరుగా చేరుతాడు. రైల్లో అతనికి విచిత్రంగా పరిచయమైన కస్తూరి మైత్రేయికి స్నేహితురాలని తెలుసుకొంటాడు. ఆమెతో చిత్రమైన అనుబంధం పెంచుకొంటాడు.

విశ్వాన్ని ఏదోఒక సమస్య పీడిస్తూ ఉంటుంది. చదువుకొన్న చదువుకు తగ్గ ఉద్యోగం రాకపోవడం, ప్రాణస్నేహితులు రంగనాథం, రామచంద్రం ఇబ్బందుల పాలుకావడం పెదనాన్న సమస్యలు ఇలా ఎన్నెన్నో అతణ్ణి వేధిస్తుంటాయి. రచయిత ఈనవలకు ఇద మిత్థమని ఒక ముగింపు చేయలేదు. విశ్వం తన సమస్యలలోనుంచి బయటపడ్డాడో లేదో తెలియదు. మధ్యతరగతివాళ్ళు సమస్యలనుంచి బయటపడడం అంత తేలికకాదు కదా మరి! అలాగే విశ్వానికి కస్తూరికి మధ్య పెనవేసిన అనుబంధం పెండ్లిదాకా వెళ్లిందీ లేనిదీ తెలియదు. ఇవే ఈనవల ప్రత్యేకతలు.

రచయిత ఈ నవలలో వాడిన శైలి హృద యంగమంగా ఉంది. రాజుకొండను కళ్లకు కట్టినట్లు వర్ణించిన తీరు పాఠకులను ఆకట్టుకొంటుంది. కథాకథనంలో లోకం తీరును, మానవుల మనస్తత్వా లను రచయిత చక్కగా వర్ణించారు. విశ్వం పెదనాన్న, మైత్రేయి, రంగనాథం, రామచంద్రం వంటి పాత్రల కథలు కన్నీరు తెప్పించేటట్లు ఉన్నాయి.

ఈ నవల ఇతివృత్తంచేత, ఆ ఇతివృత్తాన్ని నడపించిన తీరుచేతా ప్రత్యేకతను సంతరించుకొన్నది. అదే దీనికి, లెక్కకు మిక్కుటంగా వెలువడుతున్న తెలుగు నవలలు కొన్నిటికీ గల ముఖ్యమైన తేడా.

లెక్కలేనన్ని అచ్చుతప్పులు ఉండడం కూడా ఈ నవల ప్రత్యేకతగా కనపిస్తుంది. కాని రచయిత

ప్రతిభ, రచన గొప్పతనం ఆ తప్పులను మరపింపజేసే టట్లుగా ఉన్నాయి.

—శ్రీ పి. ఎస్ గోపాలకృష్ణ.

## వెలుగు లోనికి

### కవితాసంపుటి

(శ్రీ నూతలపాటి గంగాధరం. డెమ్మి 90 పొరటలు. వెల రు. 5-00 ప్రతులకు: నవోదయ పబ్లిషర్సు, ఏలూరురోడ్, విజయవాడ--2, లేక ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాదు.)

ఈ సంపుటం, అప్పుడప్పుడు యీ కవి వ్రాసి పత్రికలలో ప్రకటించినవాటి సంపుటీకరణ ముద్రణం. కవిభావాలలో ప్రాచీనత నవ్యతయు కలగలుపుగా ఉన్నట్లే, ఛందంగూడ విషయాన్నిబట్టి చేయిదిరిగి నట్లు వాడిఉన్నాడు. 'హవణింపు'లో ఆరుద్రగారు యీ కవిని అభ్యుదయకవి అని అంటున్నాడు. పూర్వం భావకవులనే మాటవలెనే యిప్పుడు యీ మాటకు అతి వ్యాప్తిదోషం పట్టుకొన్నట్లున్నది. ఇది ఇప్పుడు చలామణలో ఉండడందం కాబట్టి తగి లించుకోను అందరూ ముచ్చటపడుచున్నారు. విప్లవాలను కవులే తేవాలంటారు యీ తరగతివారు; కాని చరిత్రలో రాజకీయవాదులు ఆయుధవాణలే దేశాలలో మార్పులు దెచ్చినట్లున్నది. ఆపైన కవులు విప్లవాన్నిపొగడే వైతాళికులే అగుచున్నారు. మనదేశంలో కవులు నోటికి అడ్డం ఆపులెకుండా పలుకుతున్నారు గాని, అదే ప్రగతిపూర్ణ కమ్యూనిస్టుదేశాలలో అన గలిగి ఉన్నారా ?

నూతలపాటి గంగాధరంగారు ఆశావాది. చెడ్డ నుండి మంచిలోనికి—పుస్తకశీర్షిక సూచించినట్లు—దారితీయాలంటాడు. అంతేగాని విమర్శించి పరిష్కారమార్గం చూపనివాడు గాడు. 'కొత్త మొలకెత్తేదాకా కొంత చెత్తనుగూడ సహించాల' అని సహనం చూపగలిగి ఉన్నాడు. 'నిన్న నేడు'వంటి శీర్షికలలోగల కాలతితలపోతలలో, వగచినా ఊరట పొందగలమనే ధైర్యమున్నది. (సస్యారామంలో నిర్విరామంగా కృషిచేసే శ్రామిక కృశాంగి మేని నిగ్గులలో స్వచ్ఛందమైన అందం కనిపిస్తూంది) నిగ్గులనే చూస్తాడుగాని చెమటకష్టం చూడడు. ఈయన కోరే వెలుగు ఇది:—ప్రేమను గుండెల నిండుగా నింపే వెలుగు—నిమ్నోన్నతాలను సమతలం చేసే వెలుగు — అరణ్యాలలోను మానవత్వాన్ని సృష్టించే వెలుగు—అందరిలోను సమంగా పారే వెలుగు.' ద్వేష మలినం లేని వాంఛ.

ఆంధ్రులు, సాధారణంగా ఇతర భారతీయ భాషల పొలకువనే తెలుసుకోకుండా మా భాష గొప్పదని జంబాలు పడుతారు. కాని యీ కవి ఆదర్శం చూడండి:—ఆంధ్రభాష గడుసు పడుచును ఒంటరిగా ప్రేమించడం అంత సులభం కాదనుకొని, చుట్టూ ఉన్న తన నెచ్చెలులను గూడ ఏకంగా ప్రేమించడం నేర్చుకొన్నాను.' 'మాకంటె దీనులను హీనులను చల్లగా చూడ'మంటాడు; ఇది మానవత! కవి హృదయం సంస్కారిత మగుటచేతనే యీ తీరు తలంపులతో తన కవితకు ద్వేషకళంకం అంటకుండా జేసుకొంటున్నాడు అందరూ కోరేది ఆకలి అరకువలేని శ్రేయోరాజ్యాన్నే కదా.

ఈయన భాష స్వచ్ఛం. మాండలీకాలు చాలా సొంపుగా ఉన్నవి. కొందరు నాగన్నలు మాండలీకాలను గ్రామ్యాలనుకొని గ్రామ్యవాదం చేస్తారు. కవి సంస్కృతం తీరుతో నడుస్తున్నది. నుడికారం ధార సమతూకంగా నడచినవి. ఇట్టి కమ్మటి ప్రయోగాలు పుస్తకమంతా కుప్పలు కుప్పలుగా ఉన్నది. చదివి ఆనందించండి. 'చిన్న దీపాలలో నూనెలు రస వంతంగా ఉన్నవి. కవితలో చల్లదనం తియ్యదనం తెలివి ఉండాలని చెప్పిన మాటను యీయన చాలా వరకు చెల్లించుకొన్నట్లే.

బొమ్మలసంగతి:—అన్నీ వికారాలు వీటికి దారి చూపిన పికాసోయే (ఈమధ్య దివికేగినవారు) నలభై

యేండ్లలోపె కొన్ని మోసంచేసినా నన్నాడు. బొమ్మల మర్మం కొన్ని శీర్షికల విషయంలో గూడ దూరింది. వెసమొల ఆడబొమ్మలు—ఆకుచ కుంభాలు—జఘులిన జఘనాలు కవిత్వాన్ని చూపవుగదా, కామాన్ని గూడ రేకెత్తించవు. మగవారిని యీ చిత్రకారులు చిత్రాల వేయ లేమి? స్త్రీ స్వాతంత్ర్యోద్యమ వనితలన్నా యీ ఆట్టుపై తిరుగబడితే బాగుంటుంది.

## రేపు

(రచయితలు: బైసరామదాసు, బెడిద రాజేశ్వర్ కవితలు: క్రౌన్ $\frac{1}{4}$ - చేతి వ్రాత పతి; వెల యింతనిలేదు. ప్రతులకు — ఇందూరు భారతి; 3—12—32 అశోకనిధి! నిజామాబాదు; లేక అరుణ బుక్‌హౌస్, రాష్ట్రపతిరోడ్, నిజామాబాద్.)

ఇరవై ఏండ్ల కోడె ప్రాయంలో పుట్టిపడేఇద్దరు ఉత్సాహ ఉద్వేగాలను క్రుమ్మరించిన కవితా ధార—యీ రేపు. చేతితో వ్రాసి సైక్లోస్టైల్ చేసిన ఈపుస్తకం ఇద్దరు విద్యార్థుల వచన కవితా ప్రసూనములు. గీచిన బొమ్మలుగూడ ఉన్నవి.

ఈకారు పిల్లకాయలకు ఎంగా దినాలలో దిస మొల ఆడ బొమ్మలు (పతిత) ఆదర్శాలుకావడం మెచ్చ దగిన లభిరుచికాదేమో.

వైపరామదాసుకు భావుకతకు తగిన భాషధార మొగ్గదొడిగిఉన్నవి. చక్కటి నుడికారపు కదువులో పోతపోయబడి ఉన్నది—కవితాప్రతిమ. ఉత్ప్రేక్ష చూడండి:—'ఆఫీసు గడిగోడల మధ్య ఇస్త్రీవాడినుండి పుచ్చుకొనేవాడిదరికి అత్తవారింటికెళ్లే ఆడపడుచులా కాగితాల బరువొకటి చేతులు మారుతుంది' 'కాంతి జిమ్మె కిటికీలు పొట్టిచేతులొత్తి టపటపమని కొట్టు కొంటూ గుండెలు బాదుకొన్నవి.' కొత్త ఉపమా నాలు: — 'సమస్యల దోమలు జుయ్యి మంటు న్నాయి' 'కులమతద్వేషాల కుళ్లవాసనలు చెదలుపట్టి విరుగుతున్న ఐక్యతగదివాసాలు' వ్యాపారిని గూర్చి— 'అగ్నిగోళాలై వాళ్ల రక్తాన్ని జుర్రేసి వర్షించని మేఘాలుగా ఉండపోతారు' అని భావం మెరు స్తున్నది. వీటిలో భావానికి తగిన భాష అమరి ఉన్నది. 'పోస్టుబాక్సు' రచన జీవుభావదీపితము; కొత్త దనపు సొంపు. అక్కడక్కడా నుడికారం బాగున్నది. ఇంకా ఆ వయసుకు అనుభవానికిరాని 'ఆకలి అరపులు' వర్ణించినా, ద్వేషం అంతగా లేదు. ఈ యువకుని కవితాలతకు మంచి అల్లుడు పందిరి అబ్బితే బాగా మొన వేసి పూసి వాసనలు వెదజల్లగలదు.

ఇక బెడద రాజేశ్వరుని ఆవేశం మున్ముందు ఆయనకే బెడద అవుతుందేమో! వయసుకు అపరవిత మైన నిరాశ, ద్వేషం, ఆవేశం కాళరాత్రులు చేబదులు తెచ్చుకొన్నట్లున్నవి. స్వర్ణభారతంలో భావోద్రేకంవల్ల కవిత కుంటుపడుతున్నవి. ఈయన రానున్న రేపుకై ఆశతో కనిపెట్టుకొని ఉండదగినవాడు. ఇంకా 'చేయి బాగా తిరుగవలసి ఉన్నది.

పెద్దల ప్రోత్సాహము, సన్మార్గ దర్శకత్వము ప్రాపుగా ముందుకు పోదగిన ప్రతిభాశాలురు—ఎంగా ఇద్దరు తరుణ కవులు.

## మానవతా మేలుకో

(శ్రీ ఎస్. మునిసుందరం; వచన కవితలు. డెమ్మి—58 పేజీలు. వెల—రు. 3 —ప్రతులకు:— విజయకృష్ణా పబ్లికేషన్సు—19/10 కోటకొమ్మల వీధి; తిరుపతి.)

ఇది నేటి ఋతుధర్మంగా ఏర్పడిన గద్య కవితా సంపుటి. మాటల కలకలం ఎక్కువగా ఉన్నా భావం స్పష్టంగా (ముఖచిత్రంవలె)లేదు. పులుముడు, పూచిపెట్టడాలతో చాలా శీర్షికలు మిస్టిక్ కవితలో బడినవి. ఆవేశంలో, భావానికి తగిన భాష నిల దొక్కొనలేదు. ఆశనిరాశల దాగుడుమూత లున్నవి. ఈనాటి మానవ సమాజంలో పేరు కొనిపోయిన కుళ్లను బయట బెట్టుతాడేగాని మానవత మేల్కొనే పథకం సూచించడు— యీ ఉత్సాహం మంచి చెడ్డలులేని జీవితం ప్రపంచంలో వెగటు పుట్టి స్తుంది. చెడ్డలోమంచి— దానవునిలో మానవుని ఏరు కొని పెంపొందించడమే యథార్థలోకం. 'నిద్రరాని

నిక్సన్‌లాంటి రాత్రి' అంటే అర్థమేమి? 'సంధ్యాముఖం ముద్దులతో కందినవేళ'— ఎవరుపెట్టిన ముద్దులవి? 'గుడ్లగూబ నవ్వింది' అనే గీతంలో 'నా హృదయపు ప్రమిదలో ఉత్సాహ స్నేహాన్ని నింపి (చమురులేంది) ఆశయం అగ్గిపుల్లగీచి.' అనేది పోతులూరు బ్రహ్మంగారి దృష్టి సృష్టివాదం మాదిరి మెట్టవేదాంతంగా ఉన్నది.

కొన్ని విరోధాభాసలు:— అభివృద్ధి బృహన్నలులా నిస్తేజమై (ఆత్మహత్య) అంటాడు. ఒంటరిగా అందరు వీరులను ఓడించి ఆవుల మలవేసినవాడంత పనికిమాలినవాడా? 'ముంతాజ్ కన్నీళ్ల'లో, ఆగ్రా వచ్చి తాజ్‌ను చూచిపోయిన కరకుమానిసి క్రుశ్చేవ్ మాదిరి— 'అడుగడుగు జనావళి అశ్రుసిక్త. రక్తం గడ్డకట్టిన ఈ ప్రదేశాన, కన్నీట తడిసిన ఈ శ్మశానాన' అని కారగ్గన కమ్యూనిష్టు మాట అంటాడే గాని, ఈ కవి ఆ సమాధి రామణీయకతను ఆనందించలేకపోవడం ఒకవిధమైన తెవులులేని వేదన. 'ఈ తత్త్వం మానవతను మేల్కొల్పుతుందా? ఆ రష్యాలో అంత పెద్ద భవనాలు కట్టినారే, అవి ఆ ప్రజల ఎముకలు కండలు నెత్తురు కన్నీళ్లు కావా?

మన దేశంలో ధర్మం చెడినప్పుడు క్షత్రియులే ఎదుర్కొని (కృష్ణ—బుద్ధ) సంఘాన్ని మతాన్ని ఉద్ధరించి ధర్మాన్ని తిరిగి నెలకొల్పినారు—ఇది మన పూర్వగాథ? అట్టి రాజుల అధికారాన్ని ఎదిరించి రాజుల పచ్చినెత్తురు పారించిన పరశరాముడు ఇక్ష్వాకు మరలా పుట్టాలంటాడు—ఈ విప్లవకవి. రాముడు రాకముందు పరశురాముడు బాట వేయాలట. ఇంత భావవైరుధ్యం ఉన్నది. వర్ణాశ్రమ ధర్మాన్ని నెలకొల్పాలి అనలేదు. చాలమటుకు నయం. వర్ణధర్మం ఆశ్రమధర్మం ఎప్పుడూ పాలింపబడినట్లు లేదే. ఇది వినాదమే.

—శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-600001. Editor: S. Radhakrishna.

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 210/- | రు. 180/- |
| 2 లేక 3వ కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 180/- | రు. 150/- |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 150/- | రు. 120- |
| అర పేజి | ... | రు. 78/- | రు. 66/- |
| పావు పేజి | ... | రు. 48/- | రు. 42/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥నకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

---

## చందా వివరములు

| | ఏజంటు ద్వారా | పోస్టులో |
|---|---|---|
| విడి ప్రతి | రు. 1-50 | — |
| సంవత్సర చందా | రు. 18-00 | 19-20 |
| 6 మాసముల చందా | రు. 9-00 | 9-60 |

మేనేజరు, భారతి

మద్రాసు-600001.

BCI


AMRUTANJAN
Pain Balm
SALOFEN
SALOFEN
SALOFEN
AMRUTANJAN
AMRUTANJAN
LTD.
Gripe Mixture
Anoleum

BC

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M115 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | i, ii, iv |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Ananya |
| స్కాన్ చేసినది | Afseen |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |